# నీడిల్ వర్క్ & డ్రెస్ మేకింగ్

## पोशाक पहनावे की सिलाई और दरजीगीरी



by

G. S. N. Murthy


AUTHOR of "TAILORS' Practical Guide"
1 st. Class Govt. Certificate Holder in 'Cutting'
Tailoring Specialist of the Andhra Academy
M. T. I; M. H. School,
Anakapalle.



*Rights reserved by the Author*



**Publishers**

**M. S. R. Murty & Co.,**

**Book Sellers.**

VISAKHAPATNAM.

१९५२-५३ के परिवर्तित तथा संशोधित सांकेतिक शिक्षा विधान के अनुसार प्रकाशित हुआ।

అలవరచుకొనుటకు! ప్రబోధించుటకు!!

మొదటికూర్పు — 1952 కార్తీకము.

చెన్నరాష్ట్ర ప్రభుత్వపు వృత్తివిద్యా పరీక్షా ప్రణాళిక ననుసరించి ప్రచురింపబడినది.

ఇది బహుసులభమైన చేతికుట్లశ్రేణినుండి సాంప్రదాయక దుస్తుల కర్తనమువరకు అమిత పరిశోధనాయుతమగు ఉత్తమ ఉదాహరణావలోకనమువలన కలిగెడు సూక్ష్మపరిజ్ఞానమును కేంద్రీకరించునట్టి విశాల గ్రంథము.

కర్తనావిధానమునందు శాస్త్రపద్ధతి నవలంబించి సూచనమే జీవనముగాగల నిపుణునకును, ఉన్నత విద్యాభ్యాసమునందొక భాగముగాగల విద్యార్థికిని, ప్రభుత్వ పరీక్షార్థులగు స్త్రీ, పురుషులకును సమాన సహకారి.

*Order from,*

G. A. LAKSHMI & CO.,

**1/19 Sai Nivas, Narisingarao Pet.,**

ANAKAPALLE

*(Visakha Dt) S.*

## SOME RECENT OPINIONS

*Vidwan, Visharada*

**S. Subrahmanyam,** M. A., L. T.,

*District Educational Officer,*

**Visakhapatnam.**

Writes:

Sri G. S. N. Murthy's book on "Needle Work & Dress Making" answers a longfelt want. It is written with his eleven years experience as Manual Training Instructor in Tailoring and Needle Work.

The book is written in accordance with the Departmental Syllabus. It is copiously illustrated. It is helpful to professionals as well as Students appearing for Examinations.

Sri

# M. V. KONDALA RAO, B. A., L. T.

**HEAD - MASTER.**

**Municipal High School,**

**ANAKAPALLE.**

Writes:

I had the pleasure of perusing the book "Needle Work and Dress Making" written by Sri G.S.N. Murty, Manual Training Instructor. Municipal High School, Anakapalle. It is the first book of its kind in the field of this Handicraft. It fulfils the longfelt need of those who appear for the Government Technical Examination in "Needle Work and Dress Making". It is also a guide to those who wish to practise this art without a tutor. It covers all the aspects of the subject and the book is written in simple Telugu. I am sure that the book will be received well by the public and that they would encourage the author to do more research work in this field and give him another opportunity to publish more books of this kind.

ఓం.

శ్రీ సాయి శ్రీ రామచంద్ర శ్రీ కృష్ణపరేశాః

# తొలి పలుకు.

---

నవీన యుగములో వృత్తివిద్య కత్యధిక ప్రాముఖ్యత నొసగుచున్న విషయము సర్వవిదితము. ఇటు ప్రజలు, అటు ప్రభుత్వము వృత్తివిద్యకై తీవ్రముగు కృషి సల్పుచున్న రోజులివి. ఇట్టి యపూర్వావకాశమును చేకొని యీ రచయిత ప్రస్తుత గ్రంథమును వెలువరించుట యెంతయు ముదావహము. ప్రభుత్వమువారిచే నిర్ణీతమైన కుట్టుపని పట్టికలో ప్రథమశ్రేణియం దుత్తీర్ణులై, స్థానిక పురపాలకోన్నత పాఠశాలలో వృత్తివిద్యా బోధకునిగా పెక్కు వత్సరము లనుభవమును గడించి శ్రీ సత్యనారాయణ్ గారు ఈ గ్రంథమును రచించి యమితమగు లోకసేవ నొనరించినారు.

ప్రభుత్వపు వృత్తివిద్యా ప్రణాళిక ననుసరించి శాస్త్రీయపద్ధతిని పలు అన్యదేశీయ గ్రంథములనుండి సేకరించి సులభశైలిని అనేక నూతనములగు చేతి పనులు ఎంబ్రాయిడరీ నూతన విధానములు మరియు కత్తిరింపుల మాదిరిలు యింక సమగ్రముగా చిత్రపటములతో పొందుపరుపబడినవి. ప్రభుత్వపు పాఠశాలలలో వృత్తివిద్య గరపు బోధకులకును, నేర్చుకొను విద్యార్థులకును, కేవలము కుట్టుపనియే వృత్తిగా నుండినవారికిని గాక, ఈ ప్రత్యేక కుట్టుకళయం దభిరుచిగల ప్రతి వ్యక్తికిని యీ గ్రంథము ఎక్కువ సహాయకారిగా నుండగలదనుటకు సందియము లేదు.

Anakapalle.

(Sd) **M. SUBBA RAO**, B.A. B. Ed.,
Science Assistant,
M. H. School.

## Murthy's "Needle Work & Dress Making."

Is an outcome of long research in public taste.

This is a publication indispensable to professional and amateur tailors as well.

**KASHINATH RAO ZARAPKAR**
Instructor & Examiner
London Academy of Garment Cutting
LONDON.
**Principal**
**Zarapkar Tailoring Collage**
D.F.C. (Hons) London.

# విషయ సూచిక.

## Practical Needle Work - అనుభవయుత సూదనము

## మొదటి భాగము

పేజి

# Practical Dress Making సాధ్యమైన దుస్తు నిర్మాణము

## రెండవ భాగము

# కొలతల పట్టీ.

## సరియైన అంగసౌష్ఠవముగల పురుషులకు వలయు ప్రత్యేక కొలతల పట్టీ.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛాతీ చుట్టుకొలత | 30 | 32 | 34 | 36 | 38 | 40 |
| నడుము చుట్టుకొలత | 26 | 28 | 30 | 32 | 34 | 36 |
| పిరుదుల చుట్టుకొలత | 32 | 32½ | 36 | 38 | 39 | 41 |
| వీపు సగము వెడల్పు | 6¼ | 6½ | 6¾ | 7 | 7¼ | 7 3/4 |
| వీపు మధ్యనుండి మోచేతిమీదుగా మణికట్టువరకు | 31 | 31½ | 31½ | 32 | 32 | 32½ |
| మెడ చుట్టుకొలత | 13 | 13¼ | 13½ | 14 | 14½ | 15 |

## స్త్రీలకు వలయు ప్రత్యేక కొలతల పట్టీ.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| బస్టు చుట్టుకొలత | 26 | 28 | 30 | 32 | 34 | 36 | 38 |
| నడుము చుట్టుకొలత | 24 | 25 | 26 | 26 | 26¼ | 27 | 28 |
| తుంటె చుట్టుకొలత | 28 | 29 | 30 | 34 | 36 | 38 | 40 |
| వీపుసగము వెడల్పు | 5 | 5¼ | 5½ | 5¾ | 6 | 6¼ | 6½ |

## పిల్లలకు వలయు ప్రత్యేక కొలతల పట్టీ.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| వయస్సు | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| ఛాతీ | 24 | 24½ | 25 | 26 | 26½ | 27 | 27½ | 28 |
| నడుము | 24 | 24⅓ | 25 | 25½ | 26 | 26 | 26¼ | 26½ |
| వీపుపొడవు బొడ్డుకు సమానముగ | 10 | 10¼ | 10½ | 10¾ | 11 | 11½ | 12 | 12½ |

# వస్త్ర నిర్మాణమున కవసరమగు కొలతలు.

---

## SCIENTIFIC SYSTEM. శాస్త్రీయమైన పద్ధతి.

వస్త్ర నిర్మాణమునందు శాస్త్రీయమైన కత్తిరింపు ముఖ్యావసరము. అట్టిపద్ధతి నవలంబించుటకు మొదట నేర్చుకొనవలసిన ముఖ్య విషయము Anatomy for Dress Making శరీర సంబంధమైన శాస్త్రము. జయప్రదమైన కట్టరునకు మానవ శరీరముయొక్క పరిజ్ఞానమును బడయుట అవసరమైయున్నది.



### మానవ శరీరముయొక్క పెరుగుదల.

మానవుడు యుక్తవయస్కుడైన పిమ్మట ఎత్తులో మార్పుండదు గాని, లావులో తరచుగా మార్పు గలుగుచుండును. (In accordance with the Scientific Theory — 'After 20 years the muscles will not grow.' అను శరీరసంబంధమైన శాస్త్రము ననుసరించి ఎత్తులో మార్పు లేకుండగనే మానవునియొక్క వక్షస్థలము (చాతీ) 34" మొదలు 40" వరకు పెరుగవచ్చును.

మామూలుగా శరీర పరిశ్రమవలన గాని, కాయకష్టమువలనగాని కండరములు పెరిగి పెద్దవగుట యెల్లరకును తెలిసిన విషయమే. ఈ కండరములే పరిశ్రమ లేమిచే కృంగి నశించుటకూడ గలదు. స్త్రీయొక్క చాతీ చుట్టుకొలతను (Bust) బస్టనియు, పురుషునియొక్క చాతీ చుట్టుకొలతను (Chest) చెస్టనియు వాడుదురు.

## 1. BREAST MEASURE. ఛాతీ చుట్టుకొలత.

ఈ కొలతను తీయునపుడు ఇంచిటేపును చంకల క్రిందనుండి బోనిచ్చి చాతీ చుట్టును మామూలుగా అనగా అంతవదులుగాగాని, బిగువుగాగాని కాకుండగా తీయవలయును.

## 2. WAIST MEASURE. నడుము చుట్టుకొలత.

పై చెప్పినట్లు ఇంచిటేపును బొడ్డునకు సమానముగా నడుము చుట్టుకొలతను తీయవలయును.

## 3. SEAT MEASURE. పిరుదుల చుట్టుకొలత.

పై కొలతలవలెనే పిరుదుల చుట్టుకొలతను పిరుదులమీదుగా టేపునుంచి కొలువవలెను.

## 4. WAIST LENGTH. వీపు పొడవు.

ఈ కొలతను మెడగంట లేక వెన్నెముకపై మెడపూసనుండి వెన్నెముకమీదుగా క్రిందికి బొడ్డునకు సమానముగానుండు కొలత. ఇది సామాన్యమైన శరీరముగల వ్యక్తికి ఆపాదమస్తకమువరకు గల కొలతలో 4 వ వంతునకు 1 అంగుళము అధికముగా నుండును. Eg 5'— 8'' ÷ 4 = 17'' + 1/2 = (17 1/2.)

## 5. FULL LENGTH. పూర్తి పొడవు.

సాధారణముగా ఈ కొలతను వ్యక్తియొక్క ఎడమప్రక్క మెడ — భుజముకట్టు కలియు స్థానమునుండి (From the Collar Point) వెనుక వీపుమీదుగా క్రిందికి దుస్తును ధరించు వ్యక్తియొక్క అంగీకారము ననుసరించి పిరుదులమీదుగా తీయవలయును.

## 6. SLEVE LENGTH. చేతి పూర్తి పొడవు.

భుజముపై చేతికట్టుగీతనుండి మణికట్టువరకునుగల కొలత.

## 7. NECK MEASURE. మెడ చుట్టుకొలత.

అంగీయొక్క మెడపట్టీ కట్టుగీతమీదుగా మెడ చుట్టుకొలత.

## 8. ACROSS CHEST MEASURE.

ఛాతీ వెడల్పు కుడిచంకనుండి ఎడమచంకగుంట ఒడ్డువరకు గల కొలత.

## 9. ACROSS BACK MEASURE.

వీపు వెడల్పు (arm-hole) ఈ కొలత పై చెప్పినకొలతవలెనే వీపుపై కుడిచంకగుంట ఒడ్డునుండి ఎడమచంకగుంట ఒడ్డువరకు.

## SCALE. స్కేలు.

అనగా ఛాతీలో సగము కొలతగాని లేక ఛాతీ చుట్టుకొలతలో 3 వ వంతునకు 6 అంగుళములు అధికముగాని స్కేలు అనబడును.

ఉదాహరణ:— ఛాతీ చుట్టుకొలత 36" అయినప్పుడు

36 ÷ 2 = 18" or 36 ÷ 3 = 12 + 6 = 18"

## సూదిపనికి కవసరమగు పరికరములు.

ఈ గ్రంథమునందు చెప్పబడిన కళకు అవసరమగు పరికరములు:

1. Sewing Needles in different sizes and numbers చేసూదులయందుగల పొడవు, పొట్టి, లావు, సన్నని సూదులు.

2. Thinble సూదనమునందు మధ్యవ్రేలియందు ధరించునట్టి పరికరము. (అంగుష్ఠానము)

3. One Shears and one Scissors ఒక పెద్ద కత్తెర మరియు చిన్న కత్తెర.

4. కత్తిరించుటకు Cutting Table తదితర పనుల కుపయోగింపబడునట్టి బల్లయొక్క పరిమాణము 45" × 36"

5. Foundation Square:— మూలమట్టము.

6. Scale:— అడుగుబద్ద.

7. Inch Tape:— కొలతలు తీయుటకు నుపయోగపడునట్టి అంగుళములు 60" గల టేపు.

8. Case of coloured thread reals and balls రంగు రంగుల దారపుబండ్లు, బంతులుగల పెట్టె.

9. Coloured Paper for Cutting Block Patterns నమోనాలను కత్తిరించుటకై రంగు కాగితము.

10. Tailor's chalk and double coloured pencil కుట్టుపనివాని బల్లపరుపు ముక్కోణాకారము గలిగినట్టి రంగుసుద్ద. మరియు ఎఱుపు, నీలముగల పెన్సిలు.

11. Multon or woolen cloth for drafting Diagrams of genuine garments scientifically — of size 45" × 36"

దుస్తులను శాస్త్రీయముగా కత్తిరించు నలవాటుకొరకు నుపయోగింపబడెడు ఉన్నిబట్ట — 45" × 36"

12. Pin Box and Wax Etc. గుండుసూదుల పెట్టె, మైనము మరియు తదితర ముఖ్యావసరమైన పనిముట్లు.

# First Lessons of Plain Sewing.

# సామాన్య కుట్టుపనియొక్క మొదటి పాఠములు

---

**(Needle Work)** "సూది పని" ప్రస్తుత వాడుకపదములో సూది లేక చేసూదివలన జరుగు ప్రతి పనియు అనగా కుట్టుపు యంత్రముయొక్క సూదివలన చేయబడుచున్న పనులుకూడ యీ పదమునందే యిమిడియున్నవి. పూర్వము యీ యంత్రములు వాడుకలోనికి రాకపూర్వము ప్రస్తుత యంత్రములపై జరుగుచున్న ప్రతి

మరియు కొంతవరకు స్వహస్తముతో చేసూదిపనులననే ముగింపబడుచుండెడిది. అందువలన కుట్టుపనులు పై చెప్పినట్లు నే సూదిచే ముగింపబడినప్పటికి సూచికా విద్య (Needle Work) యనియే చెప్పబడుచున్నది.

కొన్ని సంస్కృతగ్రంథములకు ప్రాస్తాము "సూదన" మనిన చేసూది పని యనియే అర్థము.

ఈ చేసూదితోనే అనేక రకములగు లేసుపనులు, బుటేదారీ పనులు, ఉల్లైను పనులు, టీపెనింగు పనులు, గృహమునకు సంబంధించిన మరామతు పనులు, కప్పుకీలెలు, మాసికలు వేయుట మొదలుగా గల పను లన్నియూ చేసూదినలననే ముగించెడివారు. నిజము చెప్పవలసివచ్చినప్పుడు యంత్ర సహాయము లేకుండగనే కేవలము చేసూదితో పై చెప్పిన రకపు పను లన్నియూ తదితరాధారములు లేకయే నెరవేర్చుకొనుటకు తక్కిన విధానము లిందు విశదీకరింపబడినవి.

అందుచేతనే ప్రాథమిక శాల, బాలికలకు యీ సూదనమును గరవునప్పుడు ఉపాధ్యాయ, ఉపాధ్యాయినులు పై చెప్పిన పనులన్ని టియందును అనుభవము గడించియుండినను, ఉండకపోయినను ఆయా పనులలో గల విషయములను, సులభ సాధనములను విద్యార్థులకు విపులముగా తెలియజేయునట్టి సమర్థత ఇందలి విధానములను, సాధనలను పరిశీలించినంతమాత్రముననే కలుగక మానదని చెప్పకతప్పదు. చదివి గ్రహించుటకును, చెప్పి బోధించుటకును, చేసి చూపించుటకును చాలా వ్యత్యాసము కలదు. గాన ఈ క్రింద నీయబడిన చేసూది పను లన్నిటిలోను అలవాటుపడి, అనుభవము గడించుట ముఖ్య కర్తవ్యము.

## **How to handle the Needle.** సూదిని పట్టుకొను విధానము.

సూది నుపయోగించుటకు ముందు 1 వ నెంబరు బొమ్మను శ్రద్ధగా గమనించెదరేని విశదము కాగలదు. బట్టపై ప్రయోగించు

టకు పూర్వము సూదిని చూపుడు, బొటన వ్రేళ్ళతో సగము పైకి కనుపించునట్లును, అడుగు భాగము మధ్య వ్రేలియందు ధరింపబడిన అంగుస్థానము పై గల గుంటలలో నైదైన నొకదానియందిముడునట్లును చూచి బట్ట యొక్క మడత అడుగుభాగము నుండి పైకి పొడిచి దారముతో సూదిని లాగవలయును. ఇట్లు కుట్టుచూ పోయిన యెడల చిన్న చిన్న కుట్లు ఏర్పడును.



Dia. No. 1.

## Manipulation of the Needle

సూదియొక్క నిపుణతవలన సంబాళించగలుగునట్టి కుట్లు:—

ఈ కుట్లలో అనేక రకములు గలవు. ప్రస్తుత గ్రంథమునందు కొన్ని కుట్లనుమాత్రమే నిరూపింపగలిగితిమి. వాటినే Basic Stitches అనిగాని, ప్రాథమిక కుట్లనిగాని అందురు.

**1. Tacking** - టాకింగు:— ఇది బహు సులభమైనది. సూదియందు దారమునుంచి బట్టయొక్క అడుగునకు, పైకి కుట్టుచు పోయిన ఒకవిధమైనకుట్టుఏర్పడును. పెద్ద పనివాండ్రు తరచుగా దుస్తు నిర్మాణమునందు దీనిని తాత్కాలికపుకుట్టుగా Temporary Stitch వాడుచుందురు. ఏ 2 భాగములను కలుపవలసిననూ ముందుగా టాకింగు చేసి పిమ్మట గట్టికుట్టు వేయుదురు. ఇది ఒక అంగుళము గాని, అంతకు అధికముగాగాని, కుట్టునకు కుట్టునకు మధ్యదూర ముంచి కుట్టవలెను. షర్టులయొక్కయూ, కోట్లయొక్కయూ లైనింగుల నమర్చుటయందును దీనిని వాడుదురు.

## (a) Crape Tacking - క్రేప్ టాకింగ్:—

దీనిని ఎడమవైపునుండి ప్రారంభించెదరు. ఒక పెద్ద కుట్టు, రెండు చిన్న కుట్లుగా కుట్టుచూపోవలయును. దర్జీలు ఉన్నెదుస్తులు కుట్టునపుడును, వలిసూదనమునందునూ, బట్టను కత్తిరించిన పిమ్మట అవసరమైనచోట్లయందును తాత్కాలికపు కుట్లక్రింద వాడుదురు.

## (b) Tacking stitch for scirts-టాకింగ్ స్టిచ్ ఫర్ స్కర్ట్సు

స్కర్టు అనగా ఫ్రాకులయొక్క నడుముకుట్టుపైనుండు భాగమును Bodice బాడీసు అనియు, అడుగు భాగమును Scirt స్కర్టనియూ వాడుక. లంగా నడుముచుట్టునుండు బట్ట సన్నని కుచ్చిళ్ళుగాగాని, వెడల్పు ప్లీట్లుగాగాని యుండవచ్చును. ఇట్టి లంగా తయారుచేయునపుడు అనగా బాడీ, లంగాను కలుపునపుడు 2 వ పటములో A గుర్తుగల కుట్టును కొంచెము ఏటవాలుగా కుట్టవలెను. బ్లౌజులయొక్క బుట్టచేతులకుకూడ వేయు కుచ్చిళ్ళయందు దీ కుట్టు నుపయోగింతురు.

## (c) Tacking stitch for velvets or silks:—

ఇది యొక మాదిరి టాకింగు కుట్టు. దీనిని అతిమృదువైన సిల్కు, నార, మొఖమల్, జార్జిటువంటి బట్టలపై ప్రయోగించెదరు. ఈ విధమైన టాకింగు పై చెప్పిన బట్టలపై అవసరమైనచోట్ల తాత్కాలికపు కుట్టుక్రింద నుపయోగింతురు.

## Catch stitch — కాచ్ కుట్టు:—

దుస్తుయొక్క భాగములను కత్తిరించిన పిమ్మట 2 భాగములను కలిపి సమానముగా నమర్చి ఉపయోగించెడి టాకీకుట్టును కాచ్ కుట్టందురు.

## 2. Running: రన్నింగు (త్వరితపు కుట్టు.)

ఇవి టాకీకుట్టువలెనే యుండి కదలిక గలిగియుండి కుట్లు చిన్నవిగాను, సమానదూరము కలిగినట్టివిగాను నుండును. ఇది ముఖ్య

ముగా ఉన్న దుస్తులయందును, పట్టీలపైనను ఉపయోగింతురు. సూది యందు 20" దారము నుంచి సూదిని బట్టపై క్రిందికి మీదికి త్వరగా దగ్గరగా పొడుచుచూపోయిన చిన్న చిన్న కుట్లేర్పడును.

## 3. Fly Running - అతి త్వరిత సూదనము.

దీనిని రన్నింగు మాదిరిగనే అతి త్వరితముగా డజను సార్లకు తక్కువ కాకుండ బట్టపై పొడుచుచూ సూదిని పోనీయవలయును. ఇట్లు చేసినయెడల సమానదూరములో చిన్న చిన్న కట్లు ఏర్పడును.

## 4. Back Stitch వెనుకకుట్టు లేక Stoating Stitch స్టోటింగు సూదనము:—






Dia. No. 2.

2 వ నెంబరు బొమ్మను శ్రద్ధతో గమనింపుడు.

అందు 1-2-3-4 లైనుల మధ్య పరుపబడినది బట్టగా భావింపుడు. 1-2 లైనుకుసరిగా క్రింది 5-6 లైనువరకుగలది (Broad hem) వెడల్పు పట్టీ మడత మధ్యగీత 7-8 లైను బ్రాడ్ హెమ్మొక్క లోపలకు మడువబడిన సన్నమడత. ఇప్పుడు 5-6 లైనులపై మార్కు చేయబడిన వరుస నెంబర్లను సరిగా గమనింపుడు. అవియే (Back Stitch) యొక్క సమాన దూరములో నున్నటువంటి చిన్న కుట్లు,

పటమునకు మధ్య వేయబడిన అంకెలు గమనింపుడు. ముందు 5 వద్ద సూదిని గ్రుచ్చి 3 నుండి పైకి తీసి 1 వద్ద గ్రుచ్చి క్రిందినుండి పైకి లాగి మరల 4 వద్ద పైకి తేల్చి 3 వద్ద క్రిందికి తీసి యీ విధముగా వెనుక ముందునా కుట్టుచూపోయిన (Back) లేక స్టోటింగ్ స్టిచ్ ఏర్పడును.

## 5. Hemming పట్టీకుట్టు.

మడత వెడల్పుగా నున్నదిగాని లేక (Narrow Hem) సన్నని మడతనుగాని కుట్టవలసివచ్చినప్పుడు యీ కుట్టు చాల ఉత్తమమైనది, దీనిని జములు కుట్టుతో ప్రారంభించి బట్టలో మడతలేనిచోట ఒంటి పొరపై 1-2 కుట్లు కుట్టి సూదిని ఎడమవైపునకు పోడుచుచూ మడత యొక్క అంచుననే చిన్న కుట్టును కుట్టుచూపోవలయును.

## 6. Slip Stitch అదృశ్యవళి సూదనము.

బట్టను మడతపెట్టి కుట్టునపుడు దీని నుపయోగించెదరు. బట్టను మడత వేయగా నేర్పడిన అంచుకు చివరనుండి జములుకుట్టుతో ప్రారంభించి అడుగునుండి వచ్చు నొక దారమును పైకి తీయుము. ఉపయోగించబడెడి దారము ఊలుగాని సిల్కు అయినప్పటికి ఒకటి, రెండు పోచలను పైకి తీయవలయును. సూదిని మడచిన అంచు చివర ఎడమ ప్రక్కనుండి అడుగు భాగమునుండి పైకి తీయుచూ దగ్గర దగ్గరగా కుట్టుచూ పోవలయును.

## 7. Slip Stitch or Invisible Hemming

అదృశ్యవళి సూదనము.

ఇదియే దర్జీ ప్రపంచమునందుండెడి మామూలు వాడుకపదము, "పమ్మకము" (The Tailor's Hemmihg) దీనిని పురుషులచే ధరింపబడు (Civil Garments) సిల్కు, అల్పాకా, ట్వీడ్ మొదలగు ఉన్నిబట్టలతో తయారై మనచే ప్రస్తుతము కోట్లని పిలువబడు

(Launge Jacket, Refer Jacket) మొదలుగాగల దుస్తుల లోపలి కుట్లన్నిటిలో అదృశ్యవళి సూదనమునే తరచుగా చూచుచుందుము. ఇది మిలిటరీ పనులలో ఈ విధమైన పనియొక్క వివరములను ముందు ఎంబ్రాయిడరీ సెక్షనులో చదివి గ్రహించగలుగుదురు. పై చెప్పిన మూడు రకముల కుట్లకు సన్నిహిత బాంధవ్యము గలదు.

## 8. Herring Bone Stitch డైమానుగడి కుట్టు.

నెం. 3 రు పటములోని B గుర్తుగల కుట్టును చూడుడు. అదియే డైమాను గడి కుట్టు. దీనిని అంచులు మడిచి కుట్టునపుడు కుట్టుటకుగాను దీని నుప యోగింతురు. కుట్లు కొంచెముదూర ముగా నుండవలయును. ఎడమవైపునుండి ప్రారంభించి కుడివైపునకు కుట్టుచూపోవలయును. సూదిని అడుగుభాగమునుండి తీయుట ప్రారంభించి పై అంచునకు తీసికొనివచ్చి మడతపై ఒకటి రెండు పోగులను తీయవలయును. ప్రతి కుట్టును ఒకే వరుసలో వచ్చునట్లు చూడవల యును. దళమైన అంచులు కుట్టునపుడు కుట్టుయొక్క దళము ¼ అంగుళము ఉండవలయును. దళ మెట్లున్నను క్రమముమాత్రము మారకూడదు. కుట్లన్నియూ సమానాంతరముగా నుండవలయును. ఇది ఎక్కువగా ఉన్నె, ఫ్లానలు, ఆల్పాకా మొదలగు వేడిబట్టలు కుట్టునపుడును మన కుట్టుపనివారు తరచుగా దుస్తులయొక్క కాలరు, ఫ్రంటులయొక్క లైనింగుల పాడింగులయందును ఉపయోగించెదరు,

A
B
C
D

Dia. No. 3.

## 9. Over Sewing ఉపరి సూదనము.

దీనిని రెండంచులు కలిపి కుట్టునపుడు ఉపయోగింతురు. రెండంచులను సమానముగా నుంచి సూదిని ముందుకు తీసి కుడిప్రక్క చివరనుండి జములుకుట్టుతో ప్రారంభించి వెనుకభాగమునుండి సూదిని జొనిపి ముందుభాగమునకు తీసి కుట్లు అడుగుభాగమునందు

ఒకే వరుసలో వచ్చునట్లు కుడివైపునుండి ఎడమవైపునకు ఒక క్రమములో నుండునట్లు దగ్గర దగ్గరగా కుట్టవలయును.

## 10. Whipping:- మలిసూదనము.

ఇది ఉపరిసూదములోని యొక విధానము. ఒక్కొక్కప్పుడు గాసుగాకత్తిరించిన అంచులయొక్క రేగియున్న దారపు మొలకలను అణచిపెట్టి పైవైపునకు సన్ననిఅంచువలె కనబడునట్లుగా వేయునట్టి కుట్టు.



Dia No. 4

మరియూ రెండంచులను కలిపి కుట్టునపుడుగాని ఒక లేసును బట్ట అంచునకు కుట్టునపుడుగాని ఒకదానియొక్క Narrow hern సన్నని అంచునుగాని Broad hem వెడల్పుపట్టీ కుట్టునపుడుగాని దీనినుపయోగింతురు. అంచుచివరను అనగా కత్తిరింపబడిన బట్టయొక్క అంచుచివరనూ, ముందువైపునకు మలిపి, కుడిప్రక్కనుండి ప్రారంభించి సూదిని వెనుకభాగమునుండి ముందరిభాగమునకు రానిచ్చి కుట్లన్నియూ ఒకే కోణములో నుండునట్లు కుట్టుచూ, కుట్టుకు కుట్టుకూ మధ్య 1/8 అం॥ ఉండునట్లు చూడవలెను.

## 11. Over Casting: చిమ్మెడు కుట్టు.

ఈ కుట్టును సాధారణముగా మొదట జములు కుట్టుతో ఎడమనుండి ప్రారంభించెదరు. ఇదియునూ విప్పింగువలెనే కనుపించును. దీనిని ఫ్రాకులకు, దుస్తులయొక్క బాడీసు స్కర్ట్సు, చేతులయొక్క అడుగు భాగమునందు వేయబడిన కుట్టును బలపరచుటకై దర్జీలు అమితముగా దీని నుపయోగింతురు.

అదియునుగాక, చిత్రముల ప్రకారములో కత్తిరింపబడిన బట్ట యొక్క అంచును లేచియున్న దారపు కొనలను అంటియుంచుటకు గాని, సాపుచేయుటకుగాని ఆర్గండీ, బ్లేజరు, సన్‌ప్రూఫ్ వగైరా ఉన్న బట్టలయందు ఉపయోగింతురు.

అంచుపైనుండి కుడివైపునకు పోనిచ్చి తీసి కుట్టునపుడు, కుట్టునకు మధ్య 1/8” ఉండునట్లు ఒకే కోణములో దారమును న్యాలప్ వేయుచు చుట్టుచూ దగ్గర దగ్గర కుట్లతో కాజావంటి ఐలెట్ రంధ్రములను పూర్తిచేసి దారమును త్రెంచివైచుటకు పూర్వము ఒక న్యాలప్ వేసి ముగించెదరు. కుట్లు కుట్టుటవలన అంచునకు ఒకవిధమైన గట్టితనము ఏర్పడును. దగ్గర నేత బట్టలయందు కుట్లు కొంచెము దూర దూరముగా నుండవచ్చును.

## 12. (a) Faggot Stitching ఫాగట్ స్టిచ్చింగ్.

పైకి కనబడునట్టి కుట్లతోకూడి, కంటికింపగునట్టి దృశ్యములో బ్లౌజులపైనను లింగరీ పనులలోను కనబడుచుండును. ఫాగట్ స్టిచ్ కు ప్లెన్నిటిలోనూ బహు సూక్ష్మముగానుండి బహు అందముగా నుండును. మనము కుట్టవలసిన బట్ట యొక్క అంచును అవసరమైనంత వెడల్పులో మడచి ప్రస్ చేసిన అంచులను ఒక దళసరి కాగితముపై బట్టయొక్క (సీదా) పై భాగ ముండునట్లును 1/4” కాగితమునకు బట్టఅంచుది



Dia. No. 5.

గువగానుండునట్లుపిన్నులతో నమర్చి కుట్టవలెను. ఉపయోగింపబడెడి బట్ట ఎంబ్రాయిడరీ సిల్కుగాని, స్టాండర్డు కాటనుగాని, కాళీ నేతతోకూడిన

నూలుబట్టగాని అయియుండవచ్చును. బట్టయొక్క పై మడతలోనుండి కొన్ని దారములను తీసివైచి ఆనవాలునకు అడుగుభాగమున ఫాగట్ స్టిచ్ యొక్క కుట్లను మొదలుపెట్టవలెను. దీనిని కుడినుండి ఎడమకు కుట్టవలెను. మొదట పని మొదలుపెట్టినపుడు అంచుయొక్క పైభాగమునను, తరువాత అడుగుభాగమునకు కుట్టుచూ, పని పూర్తియగు వరకు కుట్టి మొదట పిన్ చేసిన కాగితమును తీసివేయవలెను. మనము కుట్టిన కుట్లను కదలనీయకుండ యిస్త్రీతో అణచి యుంచవలెను.

## (b) Bar Faggoting తిన్నని ఫాగెటింగు.

దీనిని ఒకప్పుడు కొన్ని చోట్లయందు ఓపెన్ స్టిచ్ గా కుట్టినపుడు అలంకార విధానములో దీనిని బార్ ఫాగెటింగనియూ (Veeing) వీ ఆకారములో నున్నదనియు పిలుతురు. పై చెప్పినట్లు బట్టయొక్క అంచును మడచి అడుగున కాగితమును పిన్నులతో నమర్చి పనిప్రారంభింపవలెను. సూదియందు దారమునుంచి అంచుయొక్క అడుగునుండి సూదిని పయికితీసి తిన్నగా పై అంచు అడుగునుండి సూదిని వెనుకకు లాగవలయును.



Dia. No. 6.

పిమ్మట నిలువుపచ్చిన దారములోనుండి సూదిని 2 సార్లు మెలివైచి బొమ్మలో చూపిన మాదిరిగా త్రిప్పి దిగువ భాగమున

సూదిని గ్రుచ్చి మరల 2 వ కుట్టు ఆలాగుననే కుట్టవలయును. కుట్టు పూర్తియైన పిమ్మట ఇదివరలో వేయఁబడిన టాకీని, పిన్నులను తీసి వేయవలెను. ఈ శాక్ ఫాగెటింగును అలంకారముకొరకు చంటిబిడ్డల దుస్తులపైనను, ఫ్రాకులపైనను, కాలర్సు, కప్పులపైనను కుట్టుచుందురు. బట్టయొక్క అంచునకు పైపింగు చేసి పిమ్మట ఈ ఫాగెట్ కుట్టినచో బట్టకు తగిన అందము నిచ్చును.

## Absolute Cleanliness.

పనియందు ప్రవేశించునప్పుడు అవలంబించవలసిన పరిశుభ్రత.

ప్రాథమిక సూదనోపదేశమునందుపాధ్యాయులు విద్యార్థులకు బోధించి అవలంబింపజేయవలసిన ముఖ్యవిషయములలో మొదటిది పరిశుభ్రత.



Dia. No. 7.

ప్రాథమిక పాఠశాలలయందుగాని, మధ్యమ, ఉన్నత పాఠశాలలయందుగాని ఇట్టి (Art Section) కళాభాగము. కుట్టుపనిని నేర్పు

భాగ మున్నయెడల అట్టిచో బాల, బాలికలను ఈ పనికొరకై నియమింపబడిన కాల పరిమితి స్వల్పముగను, పనిలో కూర్చొనబోవుటకు పూర్వమే విద్యార్థులు తమ చేతులను శుభ్రపరచుకొనియుండుట ముఖ్యావసరము. అట్లుండనియెడల కలిగెడి నష్టములెన్నియో కలవు. అనుభవముపై విద్యార్థులు తామంతట తామే గమనింపగలుగుదురు. కాని ఉపదేశకులగువారు మాత్రము ముఖ్యముగా పరిశుభ్రతను మొదట తాము గమనించుచూ తరువాత విద్యార్థులకు గమనింపజేయవలయును.

These are the following Golden Rules to be adopted by each and every pupils of this interesting Subject

విద్యార్థులు పనిచేయుటకు కూర్చుండెడి బల్లలను, పనిచేసెడి డ్రాయర్లను, పని పూర్తియైన వెంటనే తెల్లనిబట్టతోగాని కాన్వాస్ గుడ్డతోగాని కప్పియుంచవలయును. ఈపై రెండునూ లేనిపక్షమున కాగితముతోనైననూ కప్పవలెను. కొలతలనుతీయునపుడు అడుగు బద్దలను (Scales) ఉపయోగింపరాదు. వీటి యొక్క ప్రయోగము దుస్తులయొక్క ఆకారపుబొమ్మలను గీయుటలో అవసరమైన ముఖ్యస్థలములయందుమాత్రమే స్కేలు వాడి కొలతలకు టేపును వాడవలెను.



Dia. No. 8.

## Wearing of Thimbles అంగుష్ఠానీ ప్రయోగము

ఇది చాల ఉత్తమమైనది. దీనిని మధ్యవ్రేలికి ధరించి కుట్టుట వలన దళసరి గలిగిన దుస్తులు కుట్టుటయందును వ్రేలికి సూది గ్రుచ్చుకొని రంధ్రముపడి బాధింపకుండ సహాయపడును. దీనిని అలవాటు చేయకుండ విద్యార్థులు కుట్టుట చాల యనర్థకము. మంచియందమైన బట్టను సరియైన కుట్లతో ముగింపవలయు నని ఇట్టి అంగుష్ఠానీ ప్రయోగ మము లులో లేనిఎడల సూది సరిగా నడువక కుట్లు అందముగా లేక



Dia. No. 9.

బాధపడుటయేకాక సూదియొక్క అడుగుభాగము మధ్యవ్రేలియందు గ్రుచ్చుకొనిపోవుటకూడ తటస్థించును. కుట్లందముగా నుండుటకును, పని త్వరితగతి నుండుటకును అంగుష్ఠానీ ప్రయోగము బాల, బాలికలకేగాక ఈ పని నభిలషించు ప్రతివారికిని ముఖ్యావసరము.

(Dia. No. 9.) చూచిన తెలియగలదు.

## Correct Position for Work

### పనియందు కూర్చుండెడి సరియైన పద్ధతి

సూచీ విద్యాభ్యాసమునందు కొద్ది అనుభవము చేకూరిన తరువాత యేవిధముగా కూర్చుండుట కలవాటుపడుట మంచిదో గురువులవారు నేర్పుటయు, విద్యార్థులు నేర్చుకొనుటయు ముఖ్యావసరము. బాలురు తమ తరగతిలో కూర్చొనబోవునపుడు వంగియుండక

మోచేతులు డ్రాయరుపై మోపక, ఛాతీ నిలిపి కూర్చొనుట కలవాటు కావలయును. వంగియుండుట కలవాటు పడుదురేని గూనేర్పడగలదు.

ఒక్కొక్క విద్యార్థి మధ్యమధ్య ఇటు నటు తిరుగగలిగినంత స్థలము విడిచి కూర్చొనవలెను. తన చేతియందుండెడి సూది పని చేయుచున్నపు డెంతవరకు పోవునో అంతస్థల మిరుప్రక్కల కుట్టుపని వాని కవసరము.

మాదిరీ పనులు కత్తిరించునపుడు నిలువబడి యెత్తయిన బల్లపై కత్తిరించవలయును. డ్రాయరున కొక్కరుగా నిలువబడి పనిచేయవలెను. డ్రాయరు బల్ల పరుపుగా విశాలముగా నుండవలయును. గదియందుంచునట్టి పరికరములు విద్యార్థుల తరగతిని, వయస్సును అనుసరించి యుండవలెను. చీకటిలో కుట్టరాదు. త్వరగా చత్వారము వచ్చును. మంచి వెలుతురుగల స్థలములో పనిచేయుట మంచిది.



Dia. No. 10.

# Seams and Stitches Application of Stitches Making Seams.

| సీములు. | కుట్లు. |
|---|---|
| ఫెల్ సీము 1 | టాకింగు-రన్నింగు |
| రాక్ సీము 2 | బాక్ స్టిచ్ హెమ్మింగు |
| ఫ్రెంచ్ సీము 3 | విప్పింగు ఓవర్ స్యూయింగు |
| లాపెడ్ సీము 4 | ఓవర్ కాస్టింగ్ హెర్రింగుబోన్ |
| రాక్ అండ్ ఫెల్ సీము 5 | స్లిప్ స్టిచ్ - ఫాగెట్ స్టిచ్ |
| ఫ్రెంచ్ రన్ అండ్ ఫెల్ సీము 6 | కాచ్ స్టిచ్ |

# Difference Between Seams & Stitches.

దుస్తుయొక్క రెండు భాగములను తాత్కాలికముగాగాని, స్థిరముగాగాని కలిపి కుట్టెడి కుట్లు సీములుగా మారును.

**Stitches:-** అనగా సూదియందు దారమువైచి బట్టయొక్క రెండంచులను కలిపి అంచునకు సుమారు ¼ అం॥ దూరములో అవసరానుకూలముగా ఉపయోగించి కుట్టెడి కుట్లను అనగా టాకింగు, రన్నింగు, బాక్ స్టిచ్ మున్నగు పేర్లతో ఉపయోగించెడువాటిని స్టిచెస్ అందురు.

**Seams** సీమ్సు:— దుస్తుయొక్క కత్తిరింపబడిన ఏ రెండు భాగములనుగాని కలిపి స్థిరమైన ఫెల్, రాక్, ఫ్రెంచ్ అనంబరగు పేర్లరూపమున కుట్టెడి సైడుసను, బోల్డరుయందును, బాక్ సందును సీములరూపమున నుండు వాటిని ఉపయోగ ప్రయోగ విధానములను బట్టి ఆయాచోట్ల ఆయా పేర్లతో సీములుగా పరిగణింపబడుచుండును.



Dia No. 11

సీములయొక్క ఉపయోగ ప్రయోగములు

ఫెల్ సీము:— దుస్తుయొక్క కత్తిరింపబడిన E. G:— సైడుసీమును, ప్రక్కభాగములను రేగియున్న దారపు మొలకలతో (రెండు రా ఎడ్జిలను) సమానముగా చేర్చి సీదాకు, సీదాకు చేర్చి అంచునకు ¼ అం॥ దిగువగా స్థిరమైన బాక్ స్టిచ్ తోగాని, షైరన్నింగు స్టిచ్ తోగాని సమాన దూరము గలిగిన కుట్లతో కుట్టి పూర్తియైన పిమ్మట రెండుపొరలను విడదీసి సీదాభాగమునందు రిబ్ ఎడ్జిపై (అనగా

మొదట కలిపి కుట్టిన రెండంచులు ఒకే ప్రక్కగా నుండునట్లు చూచి) 1/16" దూరములో పోవునా బాక్ స్టిచ్‌తో పూర్తిచేయవలెను. దీనినే ఫెల్ సీ మందురు.

రాక్ సీము:— అనగా పై చెప్పినట్లుగా కత్తిరింపబడిన దుస్తు ప్రక్కఅంచులను, రేగియున్న దారపు మొలకలను, మొదటి అంచునకు రెండవ అంచు ¼ అం॥ దిగువగా నుంచి, మొదటి యంచును రెండవ అంచు పైకి దారపు మొలకలను కనబడనీయకుండా మడచి బాక్ స్టిచ్‌తో పూర్తిచేసి రెండు పొరలను విడదీసి రిబ్డ్ ఎడ్జిపై (Ribbed Edge) పై చెప్పిన దూరములో కుట్టి పూర్తిచేయుదానిని రాక్ సీ మందురు.

ఫ్రెంచ్ సీము:— ఉల్టాకు ఉల్టా కలియునట్లు చూచి పైవిధముగానే (Back Stitch) బాక్ స్టిచ్‌తో పూర్తిచేసి పదునైన కత్తె




Dia. No. 12.

రతో రేగియున్న దారపు మొలకలను బహు జాగరూకతతో కత్తిరించి రెండు పొరలను విడదీసి తిరిగి సీదాకు సీదాను చేర్చి ఈ అంచులను పైకి కనబడనీయకుండ అతి నిపుణతతో సమర్థించుచూ (Back Stitch) తో కుట్టుచూ పోవలయును. అపుడు ఉల్టావైపునకుగాని, సీదావైపునకుగాని దారపు మొలకలు కనుపించవు.

## French Seam పరాసు కుట్టు లేక గుప్త సూదనము

ఈ కుట్టు అతి సున్నితముగా నుండుటచేత వివిధ రకముల (Cut Pieces) ముక్కలను కలిపి దుస్తులను తయారుచేయుటలో నుపయోగించెదరు. ఇది దుస్తుయొక్క రెండు ప్రక్కలకును అందముగా కనుపించును. ఉన్ని, ట్వీడు మున్నగు దళసరి బట్టలపై నుపయోగించరు.

## Method పద్ధతి

సీదా, సీదా కలిపి పైకి మడచి పై చెప్పిన విధానమున బిగింపుము. మొదట నీ కుట్టును సీదావైపునకు ప్రారంభింపుము. అతిమృదువైన బట్టలలో తయారుకావలసిన దుస్తులయొక్క కత్తిరింపబడిన ప్రక్కకుట్టు అంచులనుగాని, ఫ్రాక్ అడుగు భాగమున లంగాయొక్క యిరుప్రక్కల కుట్లుయొక్క అంచులనుగాని మొదట ఉల్టాకు, ఉల్టాను చేర్చి అంచునకు ¼ అం॥ దూరములో కుట్టును అనగా గట్టికుట్టు నుపయోగించి పూర్తిచేసి అంచుచివర రేగియున్న దారపు మొలకలను సన్నని వాడియైన కత్తెరతో కత్తిరించగా వచ్చిన 1/8" అంచుభాగమును అణచిపెట్టి బట్టను పూర్తిగా విప్పి తిరిగదీయగా సీదా లోపలకు పోయి ఉల్టా పైకి వచ్చును. అపుడాయంచునకు ¼" దూరములో యిదివరకు రేగగా కత్తిరించివేయబడిన అంచును ఎడమచేతి బొటన చూపుడు వ్రేళ్ళతో పైకి రాకుండ లోనికి జొనుపుచూ గట్టికుట్టు కుట్టుచూ పోవలయును. అపుడు బట్టను విడదీయగా యిదివరకు టంచులుగా మొలకలుగా కనుపించవు. అందువలననే దీనిని గుప్తసూదనమందురు.

## Lapped Seam లాపెడ్ సీమ్

దీనియొక్క ముఖ్యోద్దేశము బట్టపై ఉపయోగించిన తరువాత బహు చిన్న కుట్లతో నుండవలెననియూ, కుట్లు పైకి స్పష్టముగా కనుపించవలయుననియు ముఖ్యోద్దేశము. ఇది షర్టులయొక్క షోల్డర్ పీసెస్ నందు స్కర్టులయొక్క నడుముభాగమునందు దట్టమైన కుట్లతో

కనుపించుచుండును. అందుచేతనే దీనికి లాపెడ్ సీమని పేరు. అది ఎంత పనితనముతో కూడి అవసరమై యున్నదో, అంత అందముగా ముగింపవలసియున్నది. ఇది స్ట్రైట్ పాయింటు మాదిరిగా కుట్టవలెను. దీనిని అంతర్స్యూదన మని పిలుతురు.

వెనుక కుట్టుయొక్క ముఖ్యభాగపు వరుస దుస్తుయొక్క పై భాగమున కనుపించుచుండవలెను.

2 వ భాగమున దుస్తుయొక్క అడుగుభాగమునందు మడచి వంచబడిన అంచులయొక్క పై భాగమున ఓవరు కాస్టింగు కుట్టవలెను.

## Run and Fell Seam రన్ అండ్ ఫెల్ సీమ్

సాధారణముగా పెద్ద దుస్తులకు యింటియందలి అలంకృత వస్తువులకు యీ కుట్టు నుపయోగింతురు. ఇందు కుట్టు స్పష్టముగా పైకి కనుపించును. అందువలన దుస్తులకు అవసరమైన చదునుకుట్లన్నిటికిని దీని నుపయోగింతురు.

## Method పద్ధతి

కలిపి కుట్టెడు దుస్తులలోని రెండు భాగములయొక్క కుడి ప్రక్కలు కలిపి టాకావేసి Back Stitch గాని, Running Stitch గాని వేసి ముందు కుట్టిన టాకాకు కొంచెముదూరములో కుట్టుదురు. తరువాత మిగిలిన భాగముయొక్క వెనుకంచును, ముందంచుయొక్క వంచతో కలిపి గోళ్ళతో సాపుచేసి లేక నీడి కుట్టుట ప్రారంభింతురు.

## French Run & Fell Seam

దీనిని పరాసుల అతిత్వరితపు కుట్టందురు. అనగా యిది Running & Hemming కుట్లతో కలిసియుండును. ఇవి బలముగా నుండి అందముగా కనుపించును. అందువలన దీనిని పలుచని బట్టల కుపయోగింతురు.

విధానము:— కుడిప్రక్కలు కలియునట్లు సీదాకు సీదాను కలిపి అంచులను సమానముగ చేర్చి అట్లు కలిపిన అంచునకు ⅛"

ఆకారములో Running Stitch తో రెండు కుట్లను ఎడమనుండి కుడికి ప్రారంభించి క్రింది అంచును పైకి లాగి ఆ కుట్లయొక్క పై అంచు పైకి మడచి నొక్కి లోపునకు త్రిప్పిన అంచును బయటికి లాగి హెమ్ చేయవలెను.

# GATHERS AND FRILLS

## గ్యాదరింగ్సు మరియు ఫ్రిల్లింగ్సు

## Setting Gathers in to Waist Band.

లంగాలయొక్క నడుము పట్టీయందు లేక పట్టీలలోనికి బహు సన్నని దగ్గర కుచ్చిళ్లను కూర్చు విధము:- జాకెట్టు చేతులకు కప్పుల నమర్చునప్పుడును, గౌనులకు నడుము పట్టీ వేయునప్పుడును ఈ కుచ్చిళ్లను మనము అతి యందముగా అమర్చు విధానము తెలిసికొనవలసి యున్నది. ఇట్లు కుచ్చిళ్లు వేయవలసిన చోట బట్టను కుట్టిన తరువాత రావలసిన పొడవునకు 3 రెట్లు పొడవుగల బట్టను తీసికొనవలయును. అంతకు తక్కువ తీసికొనినయెడల కుచ్చిళ్లు తక్కువ వచ్చుటయేగాక చూపునకు అసహ్యముగ కన్పట్టును. అట్లు తీసికొనిన బట్టయొక్క అంచు పొడవునా సూదియందు గల దారముతో సమానదూరము కుట్లుగల (Running Stitch)తో కూర్పు వేయుటకు ఒక వరుసలో కుట్టవలయును. ఇట్టి కూర్పునందు దారమును అవసరమైన పొడవు పూర్తియ




Dia No. 13

గుపరాక ముడివేయరాదు. అందుచే మొదటనే కావలసినంత పొడవు దారమును సూదియం దుంచవలయును. మధ్య ముడి యున్న యెడల ఆ దారమునుండి బట్ట ఇటు నటు కదలక ముడుతలు తిన్నగా రావు.

ఈ విధముగా ముడుతలు లేక కుచ్చిళ్ళ నన్నింటిని పిన్నుతో సాపు చేయుచూ చేతి వ్రేళ్ళమధ్య ఆదిమిపట్టిన యెడల ముడుతలన్నియు ఒకేరకముగా హెచ్చు తగ్గులు లేకుండగనే నేర్పడును. ఈ పనినే (Strocking) లేక ఘూడించుట అందురు.



Dia. No. 14.

స్మోకింగ్:— అనగా బహు సన్నని సున్నితమైన కుచ్చిళ్ళతో కూడి ఇక చేయబడినదానిని స్మోకింగ్ (Smoking) అందురు,

ఈ కూర్పు పోసిన తదుపరి దానికి అతుకవలసిన పట్టీని తీసి కొనుము. పట్టీయొక్క ఒక అంచును సన్నముగా వంచి ఆ కుచ్చిళ్ళ యొక్క అంచుపై వేసి నొక్కిపట్టుము. ఈ కుచ్చిళ్ళను పట్టీయొక్క పొడవునకు సర్దుము. అప్పుడు సూదితో జములు కుట్టును. ఆ బట్టను, ఈ పట్టీని కలుపుచూ కుట్టవలెను. ఒక్కొక్క కుట్టు కుట్టునపుడు ఒక్కొక్క

ముడుతను పట్టీపై జాగ్రత్తగా సర్దుకొనవలయును. అప్పుడు పట్టీయొక్క రెండవ అంచును మడచి ఆ ముడుతలయొక్క 2 వ వైపునకు త్రిప్పి పై విధముగనే విప్పింగ్ స్టిచ్‌తో కుట్టవలయును.

Dia. No. 13. నందు గ్యాదర్స్ మరియు Dia. No. 14. నందు ఫ్రిల్స్ చూడగలరు.

## Shell Gathers మల్లెమొగ్గంచు కుట్టు

ఈ విధానమును 15 వ నెంబరు పటములోని బొమ్మనైన గమనించిన మీకు విశదము కాగలదు.

దీనిని సాధారణముగా చిన్న పిల్లల దుస్తులయొక్క చేతులకు, నడుమునందు కాలరు, ఏ ఆకారపు మెడగుంటలయందు వాడెదరు.

## Method పద్ధతి

ఒక అంగళము వెడల్పు గలిగిన పొడవు గుడ్డపీలికనుగాని, రిబ్బనునుగాని యిందు కుపయోగించవచ్చును. కుట్టవలసిన దుస్తుయొక్క అవసరమైన భాగపు పొడవునకు 3 రెట్లు పొడవుగల రిబ్బనునుగాని గుడ్డపీలికను రెండువైపుల అంచులను సన్నముగా మడచి కుట్టవలెను.



Dia. No. 15.

తరువాత ఈ రిబ్బనుకు లేక పీలికకు కూర్పు వేయవలెను. ఈ కూర్పు ఒక కుట్టు దిగువ అంచునకు, ఒక కుట్టు పై అంచునకు, 3 వ కుట్టు దిగువ అంచునకు ఈ విధముగా 1 అం॥ దూరములో కుట్టుచూ రిబ్బను పొడవున పూర్తియైన తరువాత దారమును గట్టిగా పట్టుకొని

దారము వెంబడినే వెనుకకు లాగినయెడల మల్లెమొగ్గంచు ఆకార మేర్పడును. అట్టి ఆకారముగల రిబ్బనును మనకు కావలసిన దుస్తునకు వేసి యతుకవలయును.

## Corded Gathers

త్రాటితో దగ్గరగా లాగునట్టి కుచ్చిళ్ళను కార్డెడ్ గ్యాదరింగ్సు అందురు.

ఉదా:— లంగా సమమునందు బొందు పోసి దారమునకు కుచ్చిళ్ళు వేసి కూర్పు వేయుటకు బదులుగా, ఒక బొందుచుట్టు ఆ బట్టను కట్టవలయును.

ఈ విధానమును 13 వ నెంబరు బొమ్మ గ్యాదరింగ్ ఫ్యాన్ యొక్క మూతియందు వేయబడిన త్రాళ్ళను చక్కగా గమనించిన యెడల విశదము కాగలదు. ఈ బొందునుమాత్రము బట్టకు కలిపి కుట్టి వేయరాదు. బొందు బయటికి ఊడిపోకుండ దానియొక్క చివరలను మాత్రము దుస్తునకు కలిపి కుట్టవలయును. ఈ విధముగా 3 లేక 4 నాడాలు లేక బొందులు వేసి కార్డెడ్ గాజింగ్ కూడ చేయవచ్చును.

## · Gausing

అనగా పైపద్ధతిని బహుసన్నని దగ్గరకుచ్చిళ్ళనువేసి ఆకుచ్చిళ్లు ఇటు నటు జరుగక చూపునకు బహుఅందముగా కనుపించునట్లు అధమ పక్షము వరుసగా ఒకదానిక్రింద నొకటి 2½ అం॥ దూరములో 4 కుట్లకు తక్కువకాకుండగా వేసి బిగింపబడు కుచ్చిళ్ళను గాజిం గందురు. దీనినే **(Sherring)** షర్రింగ్ అందురు.

ఇట్టి కుచ్చిళ్ళను సాధారణముగా చిన్నపిల్లల దుస్తులయొక్క డీప్ యోకునకు ఇక చేసిన కుచ్చిళ్ళకుగాని, నడుముపట్టిక్రిందనుండి గాని ఫ్రాక్, బ్లౌజులయొక్క చేతులయందుగాని వేసి అలంకరించు కుచ్చిళ్ళను గాజిం గందురు.

ఈ కుచ్చిళ్ళను కుట్టినతరువాత కుట్టునకు కుట్టునకుమధ్య 1 అం॥ గాని, 2 అం॥ గాని మధ్యదూర ముండునట్లు చూడవలెను. కుచ్చిళ్ళు వేసిన పిమ్మట సమానముగా పోచ్చు. తగ్గులు లేకుండా సరి Back Stitch తో పూర్తిచేయవలెను.

## Strait Frills కుచ్చిళ్ళు గలిగిన అంచులు

ఉపయోగము:— తలగడగలేబులకుచుట్టును వేయు కుచ్చిళ్ళు. అట్టికుచ్చిళ్ళను నెం 14 వ బొమ్మలో చూచిన విధా కష్టముకాగలదు. దీనినే ఫ్రిల్లింగందురు.

## Method పద్ధతి

ఇట్టి కుచ్చిళ్ళను లేక ఫ్రిల్లింగును తయారుచేయుటకు అవసరమైనంత వెడల్పుకంటె ⅛" అదనముగా తీసికొని అవసరమైన Frilling పొడవునకు 3 లేక 4 రెట్లు పొడవు గలిగినటువంటి గుడ్డపీలికను తీసికొని ఒక అంచు పొడవున Narrow Hem Stitch గాని, లేసుకుట్టు గాని కుట్టవలెను. తరువాత 2 వ అంచును ¼ అం॥ వెడల్పున రాంగ్ సైడునకు వంచి కూర్పు వేయవలెను. కూర్పు వేసిన దారపు కొసను పట్టుకొని కావలసినంత పొడవునకు లాగి మధ్యగల కుచ్చిళ్ళను కుడి చేతివ్రేళ్ళ నిపుణతతో సరిచేయవలెను. దీనిని అతుకవలసిన దుస్తుపైన గాని, గలేబులపైనగాని ఒక తిన్నని గీతను మార్కు చేయవలెను. అప్పుడు ఈ ఫ్రిల్లింగును మార్కుచేసిన గీత వెంబడినే ¼" మడచిన ఫ్రిల్లింగు అంచును వంచి గట్టికుట్టు వేయవలెను.

## Corved Edges వలయాకారపు అంచులు

పై ఫ్రిల్లింగును వేయుటకు పై చెప్పినట్లుగా 3 రెట్లు పొడవు గల గుడ్డపీలికను తీసికొని అదేవిధముగా తయారుచేసి కుట్టవలసిన వలయాకారపు టంచులకు దీనిని పిన్నులతో గ్రుచ్చి ఈ పిన్నులను వంకర తిరుగుచోటమాత్రమే అతుకవలయును. అప్పుడు దీనికున్న

కుచ్చిళ్ళను అన్నివైపులకు సరిసమానముగా నుండునట్లు జాగ్రత్తగా సర్దవలయును. ఒకప్పుడు త్రిప్పవలసిన వంకర పెద్దదైనచో ఆ వంకరను 4 భాగములు చేసి 4 పిన్నులు టాకీ చేయవలెను.

అప్పుడు ఒక సన్నని పట్టీ తీసుకొని ఈ ఫ్రిల్లింగు గుడ్డకు జాగ్రత్తగా అతికివేయుము. అట్లు చేయుటవలన దీనికి సంబంధించిన కుచ్చిళ్ళు ఈ పట్టీకిన్నీ, కుట్టవలసిన దుస్తునకును మధ్య గట్టిగా అదుము బడి యుండును.

# DARTS, PLEATS & TUCKS

## డార్టులు, ప్లీట్లు మరియు టక్కులు

అసహ్యాముగా శరీరమునకు అందముగా అమిరిన దుస్తులకు, అమరని దుస్తులకు డార్టులను పట్టుటలోనే భేదము కలదు. ఈ డార్టులను కుట్టుట చాలా సులభము. దుస్తుయొక్క ఆకారమునుబట్టి డార్టుయొక్క పొడవు, కోణము, వాలు వగయిరా నిర్ణయించబడును. పొట్టిగా నుండి వెడల్పయిన డార్టులు చొక్కాచేతుల పై భాగమునందు కప్పులు కుట్టవలసినపుడు ఉపయోగింతురు. భుజముక్రిందినుండి వక్షస్థలము మీదుగా (Bust Line) నడుముగీతవరకు నుండు డార్టులు పొడవుగాను, క్రమముగా వాలు తిరుగునట్లుగాను ఉండవలయును. ఎక్కువ పొడవుగా నుండు డార్టులు క్రమమైన వాలు కలిగియుండును. అనగా కోటు బ్యాకు యొక్క (Back Centre Seam) మధ్య కుట్టు గీత; మొట్టమొదట వస్త్రముయొక్క సీదాను లోపలకు డార్టు కుట్టవలసినచోట మడత వేయవలయును. 2 పొరలను పిన్నులతో అతుకవలయును. మడతకు పిన్నుకు మధ్యదూరము డార్టు



Dia. No. 16.

యొక్క అవసరమైన పొడవులో సగమై యుండవలయును. మడతకు లంబకోణములో మరియొక పిన్నును అతుకుము. ఈపిన్ను డార్టుయొక్క

రెండవ చివర నుండవలయును. అప్పుడు ఈ రెండు పిన్నులమధ్య ఏట వాలుగా డయాగ్నలీ (Diognally) గ్రుచ్చుము. ఈపిన్నులు గ్రుచ్చిన భాగమునుండి దారముతో టాకా వేయుము. తరువాత ఆ టాకా వెంబడినే Back Stitch తో కుట్టుము. పూర్తియైన తరువాత టాకా తీసి వేయుము.

## Pressing Darts డార్టులను అణచిపెట్టుట

సాధారణముగా డార్టులను ఒకవైపునకు మడచి తడిగుడ్డక్రింద నుంచి దానిని గట్టిగా యిస్త్రీ చేయుదురు. (Waist Line Shaping) నడుము ఆకారమును తెల్పుటకొరకు డార్టులు; ఇవి సాధారణముగా మధ్యభాగమున ఎక్కువ వెడల్పుగానుండి చివరలకు వచ్చుసరికి అతి సన్నముగా నగును; ఎల్లప్పుడును ఒకేవైపునకు మడచిపెట్టవలయును.

డార్టుయొక్క దళసరి ఎక్కువైనయెడల అనగా డార్టును పట్టవలసిన బట్టయొక్క దళసరి అధికమైనయెడల మడతలోనుండి జాగ్రత్తగా కొంతవరకు క్రిందికి, పైకి వాడియైన కత్తెరతో కత్తిరించి వేయవలెను. అట్లు కత్తిరింపబడిన డార్టుయొక్క 2 భాగములను చెరియొక ప్రక్కకు జాగ్రత్తగా గోరుతో వంచి వేడి తడిగుడ్డపైన వేసి యిస్త్రీ చేయవలెను.

## Flat Tucks చదునైన టక్కులు

ఇట్టి టక్కులను వేయుటలో లైను తప్పకుండ వేయుటలోనే దానియొక్క గొప్పతనము కలదు. లైను తప్పినయెడల దానియొక్క చదును, అందము పూర్తిగా చెడును. టక్కులు తిన్నగా వేయుటకు ఆనవాలుగా 3 పిన్నులను టక్కు వేయవలసిన స్థలమునందు ఒకదాని దిగువ మరియొకటి అడ్డుగా గ్రుచ్చవలెను. పిన్నుకు, పిన్నుకు మధ్య దూరము కుట్టవలసిన టక్కుయొక్క వెడల్పుకంటె ఎక్కువ ఉండరాదు. ఇట్లు పిన్నులను 3 చొప్పున మొదటిపిన్నుల కెదురుగా కొలది దూరములో గ్రుచ్చవలెను. 1 వ వరుస పిన్నులు, 2 వ వరుస పిన్ను

లో ప్రక్కగా చేర్చినయెడల టక్కు కుట్టువేయవలసిన స్థానము. కచ్చితముగా తెల్పును. ఇట్లేర్పడిన ఆనవాలువెంబడినే వరుసగా ౩ టక్కులను వేసి యిస్త్రీతో అణచియుంచిన అందముగా కన్పట్టును.

## Double Tucks జమిలి టక్కులు

అనగా ఒక టక్కుపై మరియొక టక్కు వచ్చును. పై టక్కు మధ్యభాగమునుండి రెండవ టక్కు వచ్చును. బ్లౌజులకు యిట్టి టక్కులు వేసినయెడల చాలఅందముగ కన్పట్టును. ఆ రెండు టక్కులయొక్క అంచులు ఎక్కడ కలియునో అచ్చట పిన్నులతో టాకా వేయుము. ఈ పిన్నులు రెండునువరుసలలో నుండవలయును. పిన్నుల మధ్య వెడల్పు కుట్టబడిన టక్కు వెడల్పంత యుండవలయును. ఇదివరకు ఒక టక్కును కుట్టుటకు యెట్లు చేసితిమో యీ రెండవ టక్కును కుట్టుటకూడా ఆ పిన్నులు గుర్తుగా నుంచుకొని అట్లే కుట్టవలయును.



Dia. No. 17.

**Pin Tucks** పిన్ను టక్కు లనగా అతిసన్నని టక్కులని అర్థము

ఇవి దగ్గర దగ్గరగా అనేకములు కుట్టినయెడల దుస్తులకు అందము నిచ్చును. దుస్తుయొక్క బ్యాక్ ఆకారమును అందముగా తేల్చుటకై యిట్టి పిన్నుటక్కుల నుపయోగింతురు. ఇవియును Flat Tucks చదును టక్కులవలెనే ఒక లైనులో కుట్టవలెను.

ఈ టక్కులను కుట్టుటకు బట్టను ఒక దారమునకు చుట్టవల యును. అప్పుడు దారము చుట్టబడిన రెండంచులకు కలుపుచు దగ్గర కుట్లు కుట్టవలయును. కుట్టబడుచున్న గుడ్డ పడుగునందలిగాని, పేక నందలిగాని పోగులు తీయుటకు వీలున్న యెడల అనవాలుకొరకు అన గా టక్కులను ఒక లైనులో కుట్టుటకు పోగులను తీయుము. ఈటక్కు లు ఒక సమూహములో అలంకారమునకుగాని లేదా ఒకటొకటిగాగాని వేసినయెడల దుస్తులకు అందము నిచ్చును. యిస్త్రీపెట్టె అంచుతో టక్కులయొక్క అంచులను యిస్త్రీ చేయుము. టక్కును కుట్టుకు చదును చేయక ఒక ప్రక్కకుమాత్రమే అణచిపెట్టి యుంచవలెను.

## Pin Darts అతి సన్నని డార్టులు

పిన్ను టక్కులవలెనే పిన్ను డార్టులుకూడ అతిసన్నముగా పట్ట వలెను. దుస్తులు కొద్దిపొడవులో సరియైన ఆకారము తీసికొనివచ్చు టకు పిన్నుడార్టు లవసరము. ఎన్ని డార్టులు పట్ట వలయునో చూచుకొని డార్టులు కుట్టవలసిన స్థలముయొక్క అంచున పిన్నులు గ్రుచ్చుము. ఉల్టావైపున అనగా బట్ట అడుగు భాగమున ఈ పిన్నులను గ్రుచ్చిన స్థలమునందు బట్టను చిన్న మడతగా మొదట వెడల్పుగాను రాను రాను సన్నముగా లాగవలయును. ఇటువంటి టక్కు లు 2 అం॥ కంటె యెక్కువ పొడ వుండరాదు.



Dia. No. 18

## Shell Tucks

దీనికొరకు మనము పట్టునట్టి టక్కుయొక్క వెడల్పు ¼ అంగు ళమునకు ఎక్కువ మించనీయకుండ చూడవలెను. అట్లు చేసినపిమ్మట చక్కగా అణచిపెట్టి టాకీ కుట్టు కుట్టి రన్నింగ్ స్టిచ్‌తో పూర్తిచేయ

వలెను. లప్పుయొక్క పై అంచునుండి ప్రతి 3, 4 కుట్లకు Shell edge వచ్చునట్లు తయారుచేయవలెను.

## Box or Bag Pleats సంచివలె నుండు చదును ప్లీట్లు

వీనిని మిరాను సాధారణముగా బుష్ షర్టులు, స్పోర్టింగు, హాంటింగు మొదలగు సూటులకు దుస్తులయొక్క వీపుభాగములయందును, జేబుల మధ్యభాగమునందును చూచుచుందురు.

పద్ధతి

ఇదివరలో చెప్పబడియున్నట్టి Flat Tucks చదును టక్కుల వలెనే అవసరమైన చోట్లయందు పట్టుదురు. ఇవి చదును టక్కులకంటె వెడల్పుగానుండి ఒక ప్రక్కకు అణచిపెట్టబడక మధ్యకు సగముగా ప్లీటును విడదీసి కుట్టు మధ్యగా వచ్చునట్లు యిస్త్రీ చేయుదురు. ఇట్టి మడతను దుస్తుయొక్క పైభాగమునం దుండునపుడు సంచివలెనుండు చదును ప్లీటందురు.

## Half opened and turned inside Bag Pleats

దుస్తు అడుగు భాగమున పై చెప్పిన విధమున చదును చేయబడి ప్లీటుయొక్క మొత్తము పొడవునందు యిరుప్రక్కల సమాన భాగములు విడుపబడిన మధ్యభాగము తెరువబడియున్న ప్లీట్లు. యివి జేబుల మధ్యభాగమునందును అలంకారమున కనుకొనుడు; మరొకందు కనుకొనుడు. ఈ విధముగానే ఫ్రాకుల స్కర్ట్సుభాగములయందునూ చూచుచుందుము.

## Across and Bias cut Flounces

ఎక్రాస్ మరియూ బయ్యాస్‌కట్ ఫ్లౌన్స్

ఇవి తయారుచేయు విధము:— ఉదా:— 16" వెడల్పు లేక 12" పొడవుగల బట్టను చతురాకారములో తీసికొని పై 2 కోణము

లకు A+B లనియు, క్రింది రెండు కోణములకు C—D లనియు పేరు పెట్టుము. అప్పుడు అనగుబద్దను తీసికొని C—B వరకుగాని, A నుండి D వరకుగాని Cross గా గీయుము. ఈ గీతకు సమాన దూరములో అంగుళము దిగువ మరియొక గీత గీయుము. అలాగుననే మొదట గీసిన గీతకు క్రిందను పైన సమానదూరములో గీసి అట్టి గీతలద్వారా అంగుళము వెడల్పు పీలికలను పదునైన కత్తెరతో కత్తిరించి వేరుచేయవలెను.




Dia. No. 19.

అట్లు వేరుచేయగా ఏటవాలు అంచులు లేక చివర్లు గలిగిన ముక్కలు వచ్చును. వాటిని ఒకదానికొకటి అట్టి వాలు కలుపుతూ సీదా సీదా చేర్చి Back Stitch తో అతికి విడదీసిన ఒక పొడుగు పాటి పీలికగా తయారగును. దానినే క్రాస్ స్ట్రిప్స్ అనియూ Cross Strip ఎక్రాస్ కట్ ఫ్లౌన్సు లనియూ అందురు.

పై చెప్పిన విధముగానే A నుండి D వరకుగాని, C నుండి B వరకుగాని వలయాకారములో పై విధముగానే సమానదూరములో అంగుళము వెడల్పున క్రింద పైని కత్తిరించి వేరు చేసి వాలు కలిపి ఒకదాని కొకటి అతుకగా ఒక గుండ్రని పొడవైన పీలికగా తయారగును. దీనినే Bias Cut Flounce అనియు, Bias Strip అనియు వాడుదురు.

ఇది దుస్తుయొక్క వేయవలసిన భాగపు పొడవుకంటె కొంచెము అధికముగా తీసికొనవలయును. దాని వెడల్పు 3/4" నుండి 1 అంగుళమువరకు యుండవచ్చును. దాని అంచును ఒకవైపున మడచి సాగదీసి కుట్టవలయును. మడత లేని అంచును కుట్టవలసిన దుస్తు యొక్క అంచునకు సీదాకు సీదా చేర్చి ఒక పావంగుళము వెడల్పున పొడుగునా కుట్టవలయును. అది వంకీ కత్తిరింపు కాబట్టి లాగి కుట్టునపుడు వాటంతట అవియే వంకీలు ఏర్పడును.

అదియునుగాక గుండ్రని ముక్కనుండి కత్తిరించిన వంకర ముక్కలు వలయాకారపు అంచునకు అందమైన పైపింగుగా నుండును. ఎక్రాసు ముక్కలు తిన్నని అంచునకు చక్కని పైపింగు.

## Piping & Binding పైపింగు మరియు బైండింగు

దుస్తుయొక్క ఒక అంచును నీటుగా చేయుటకుగాని, అలంకారముకొరకుగాని బైండింగు నుపయోగింతురు. వలయాకారములో కత్తిరింపబడిన ముక్కలు బైండింగునకేగాక, దుస్తుయొక్క రెండు భాగములను అతుకుదగ్గర పైపింగు చేయుటకుకూడ పనికివచ్చును. ఆ వలయాకారపు ముక్కను పొడవుభాగముగా సగమునకు మడువుము. అట్లు చేయుటలో సీదా పైకుండునట్లు మడువవలయును. కుట్టబోవు బట్టలో వెనుక భాగమునకు అంచులవెంబడినే దీనిని టాకా చేయుము. అప్పుడు యీ పైపింగు ముక్కను మధ్యగా నుంచి దుస్తుయొక్క రెండవ భాగమున Running Stitch వేయుము.

## Corded Piping

కుషన్లు, దివాన్ పరుపులు మొదలైనటువంటివాని అంచులను పైపింగు చేయునపుడు అతిస్ఫుటముగా కనబడుటకొరకు పైపింగు లోపల నొకవిధమైన పైపింగు త్రాడు నుపయోగించెదరు. వలయాకారపు ముక్కను మధ్యను పైపింగు కార్డు నుంచి ఆ ముక్కయొక్క పొడవు అంచుల రెండింటిని కలిపి బిగువుగా కుట్టవలయును. అప్పుడు దుస్తుయొక్క 2 భాగములను యీ కార్డెడ్ పైపింగు మధ్యను పెట్టి టాకా వేయవలయును అప్పుడు వెనుక కుట్టు Back Stitch తో ఈ పొరల నన్నిటిని కలిపి కుట్టవలయును.

## Rouleau Piping

దీనిని బ్లౌజుల మెడలకు, చేతుల చివరలందు, ఫ్రాకుల కాలర్ల యందు వేసిన బహు అందము నిచ్చును. పైపింగు పీలికను మధ్యకు మడచి వేయవలసిన అంచుచివర మడచిన పైపింగు పీలికను అంచునకు అంచు సమానముగా నుంచి దానిపై మరియొక పీలికను వేసి అతికిన పిమ్మట ఈ పీలికను వెనుకకు వంచి క్రింది చివర అంచును లోపునకు మడచి Hemming Stitch తో పూర్తిచేయవలెను. అప్పుడు అంచునకు పైగా పైపింగు స్పష్టముగా కన్పించి అందముగా నుండును.

## Binding

పై చెప్పినవిధముగా క్రాసు పీలికను కత్తిరించి స్కర్టు, బాడీల యొక్క అడుగుభాగమున బాడీకి దిగువ అంచునకు పైపింగును వేసి దానిని వెనుకకు మడచి పిమ్మట స్కర్టును గాదర్సుగా అమర్చి బాడీకి దిగువగా లోపునకు అమర్చి కుట్టుటకు బైండింగందురు. సిల్కు, జార్జిటు మున్నగు నారబట్టలు పీచు రేగకుండ రెండంచులను కలిపి క్రాసుపీలికలతో అంచుల రెండువైపుల కుట్టుదానినికూడ బైండింగందురు.

## French Binding ఫరాసు బైండింగు

అతి సన్నని అందమైన అంచుతో బైండింగు కావలెననిన అతి పలుచని బట్టను ఉపయోగించవలయును. దానిని మొదట పొడవువైపు ఒకమూలనుండి మరియొకమూలకు మధ్యగా మడువవలెను. పై చెప్పిన విధముననే యీ పీలికలను ఒకదానికొకటి అతికి వలయాకారములో కత్తిరింపబడిన ముక్కలు బైండింగునకేగాక దుస్తుయొక్క రెండు భాగములను అతుకుదగ్గర పైపింగు చేయుటకుకూడ పనికివచ్చును. ఆ వలయాకారపు ముక్కను పొడవుభాగముగా సగమునకు మడువుము. అట్లు చేయుటలో సీదా పైకుండునట్లు మడువవలయును. కుట్టబోవు బట్టలో వెనుక భాగమునకు అంచుల వెంబడినే దీనిని టాకా చేయుము. అప్పుడు యీ పైపింగు ముక్కను మధ్యగా నుంచి దుస్తుయొక్క రెండవ భాగమున Running Stitch వేయుము.

## Shell Binding

మొదట నిర్ణయింపబడిన దుస్తుయొక్క అంచునకు ఇదివరలో చెప్పినట్లుగా Bias Cut Flounce తో ముగించి పై చెప్పిన Shell Tucks పద్ధతిలో కుట్టుట యుక్తము. అంచుయొక్క అడుగుభాగమున హెమ్మును బైండు చేయునపుడు బైండింగుయొక్క అంచు పైభాగమున 1 పాతిక అంగుళమునకు మించనీయక సూదిని బైండింగుయొక్క అడుగు భాగమునకు తీసికొనివచ్చుచూ 2, 3 సార్లు దారమును త్రిప్పి దారమును బిగించి ఈ మాదిరిగా Hem చేయవలెను. అట్లు చేసిన యెడల బైండింగుయొక్క రెట్టుసైడును Shell గా ఏర్పడును.

## Bias Binding కుట్టు విధము

ఒక దుస్తుయొక్క అంచునకు కుట్టునపుడు ఈ పీలికయొక్క అంచును దుస్తుయొక్క సీదాకు దీని సీదాను చేర్చి కుట్టుము. కుట్టుకు అంచుకు మధ్య వెడల్పు బహుతక్కువగా నుండవలయును. అప్పుడు

ముక్కను వస్తు అడుగుభాగమునకు త్రిప్పి బైండింగు యొక్క రెండవ అంచును చిన్నగా మడచి కుట్టవలయును. ఈ కుట్టు సీదాపైపు బైండింగు అంచునకు తగులకూడదు.

## Binding Points

బట్టయొక్క అంచును కోణముల ఆకారముగా కత్తిరించి దానికి Bias strip ను వదలకుండ సాగదీసి రన్నింగుతో కుట్టుచూ పోయి వెనుకకు త్రిప్పి Slip Stitch తో పూర్తి చేయవలెను.

## Facing Points

బైండింగును ప్రయోగించుటకు వీలుకానటువంటి బట్టపై స్కాలప్పులనుగాని, పోయింటులనుగాని కత్తిరించి పూర్తిచేయవలె ననిన కత్తిరించవలసిన దుస్తుయొక్క అంచును, మనము పనిచేయు నఖలీ అంచును సీదాకు సీదా చేర్చి అవుసరమైనంత లోతుగల మొదటికోణములను పెన్సిలుతో కుట్టి పూర్తియైన పిమ్మట వేయబడిన కుట్టునకు 1/4 పాతిక అంగుళము సమానదూరములో పదునైన కత్తెరతో కత్తిరించి కోణములయొక్క పైభాగమునందును, అడుగుభాగమునందును గల బట్టను రెండు పొరలుగా కుట్టు తెగకుండగా నాటుపెట్టి ఫేసింగును రాంగుసైడునకు త్రిప్పి వ్రేళ్ళయొక్క నిపుణతతో అంచును సాఫు చేసి Hem గా టాకీ చేసి Slip Stitch తో ముగించవలయును.

## Binding Scollops

బిడ్డలయొక్క దుస్తులను లింగరీషనులయందును, స్కాలపింగు అంచులను తయారుచేయుటలో ఈ క్రింద చెప్పబోవునట్టి ఒక అందమైన పద్ధతి. పై చెప్పిన దుస్తులయొక్క ఏ అంచునుగాని కెరటముల ఆకారములోగాని, ముక్కోణాకారములోగాని, చదరములో నుండునట్లు కత్తిరింపవలె ననిన కాగితపు నమూనాలను నిర్దేశింపబడి ఆ యాకారములో కత్తిరించి దుస్తుయొక్క కత్తిరించిన అంచుపై పరచి

1/2 అం॥ బట్టపై దిగువగా నుండునట్లు చూచి కదలకుండ Pin చేసి మొదట పెన్సిలుతో మార్కుచేసి పదునైన కత్తెరతో పేపరు పెటనుయొక్క అంచు వెంబడినే కత్తిరించవలెను.

సన్నని బహు సున్నితమైన బట్టలపై కత్తిరింపబడిన స్కాలప్పు అంచులను బహు సన్నని వ్యతిరేకమైన రంగుతో కూడిన బట్టలో Bias Cut చేసిన పీలికను ఇదివరలో చెప్పినట్లు బైండింగు చేయుట ఉచితమైన పద్ధతి. లేక సన్నని పీలికపై స్కాలప్పు అంచునుంచి వంకరలు చూచి రన్నింగుతో కుట్టి వెనుకకు త్రిప్పి నాట్లుపెట్టి బైండింగు పూర్తిచేయుట మరియొక పద్ధతి.

## Facing Scollops

కొన్ని సమయములలో స్కాలప్పు అంచును కత్తిరింపబడిన బట్ట ప్రత్యేకమైన దళసరితో కూడియుండెనేని అట్టి అంచును స్థిరమైనట్టియు, పనితనములో కూడినట్టియు అంచుగా తయారుచేయవలెననిన పై చెప్పిన పద్ధతులలో బైండింగు నుపయోగించుటయే మంచి పద్ధతి. బట్టయొక్క అంచును క్రాసుస్ట్రిప్ అంచును టాకీతో బిగించి దానికి దిగువ పెన్సిలుతో స్కాలప్పు గీసి, ఆగీసిన గీతలద్వారా రన్నింగు వేసి రన్నింగుకు 1/4 అం॥నకు పైగా కత్తెరతో కత్తిరించిపిమ్మట Cross Strip ను వెనుకకు త్రిప్పి స్లిప్‌స్టిచ్‌తో బిగింపవలెను.

## కార్నర్సు.

### స్క్వేర్డు కార్నర్స్: చదరపు మూలలు

దీనిని పనిచేయుటలో రెండు పద్ధతులు గలవు. ఏ పద్ధతి నవలంభించినను జయప్రదమైన ముగింపు సరియైన మడతనుపెట్టుటయొక్క పనితనముపై ఆధారపడియున్నది. మొదట ఈ చదరపు అంచులను సరిచేయుటకు పూర్వము మూలమట్టమును ఆధారముగా తీసికొని

నలుప్రక్కల అవుసరమైన వెడల్పు పట్టీ సమానముగా నుండునట్లు చూచి గోళ్ళతో కీడి పట్టీని చదునుచేసిన పిమ్మట రాఎడ్జిని వ్రేళ్ళ గోళ్ళతో 1/4 అంగుళము అడుగునకు మడచి ఒక ప్రక్క కుట్టిన తరువాత రెండవ ప్రక్కను అదే వెడల్పులో మడతపెట్టి అదృశ్య సూదనము నుఇ యోజించి నాలుగు ప్రక్కలను పూర్తిచేయవలెను.



Dia. No. 20.

మెట్రిడ్ కార్నరు

అనగా చదరపు మూలలను వెడల్పు పట్టీతో ముగించుటలో 2 వ పద్ధతిని మెట్రిడ్ కార్నరందురు. ఈపనికూడ మొదటి సైడ్స్వర్డు కార్నరు పద్ధతినే పోలియుండును. మూలలను పనిచేయుటకు పూర్వము రుమాలుయొక్క 1 మూలయందు మన కెంత వెడల్పు కావలయునో అంత వెడల్పున బట్టయొక్క కోణమును ఉల్టావైపునకు అడ్డముగా Dioganal గా మడచి అనగా కర్ణాకారముగా మడచి సెంటరు పోయింటు చూచుకొని Hem చేయవలసిన అంచులను అదే వెడల్పుతో నలువైపుల మడతపెట్టి క్రీజెజ్జిలను గోళ్ళతో కీడి రాఎడ్జిని 1/8" లోపలకు మడచి పై చెప్పినవిధముగా మొదట టాకీతో బిగించి పిమ్మట స్లిప్స్టిచ్తో పూర్తిచేయవలయును. డయాగ్నల్ గా మడచిన కీలికను కత్తిరించికూడా కుట్టవచ్చును.

# False Hem & Comming Out Band

## ఫాల్సు హెమ్ము మరియు కమింగ్ అవుట్ బ్యాండ్

మనము తరుచుగా చూచుచుందు స్త్రీ దుస్తులనుగాని, పురుష దుస్తులనుగాని, బాల బాలికల దుస్తులనుగాని వెనుక భాగమునందు లేక ముందుభాగమునందు తెరవు (Opening) కలిగియుండక తప్పదు.

అట్టి ఓపినింగునందు బత్తాములు పట్టీ ఒకటి కాజాల పట్టీ మరియొకటి. కాజాలుండు పై పట్టీని False Hem అనియూ, బత్తాములు తగిలించిగాని, దాని కింటిపట్టీగాని యున్న అడుగుపట్టీని Comming Out Band అందురు.

**False Hem** అనగా తప్పుడు మడత కలిగిన పట్టీ అని అర్థము

ఈ పట్టీ మామూలు Hem వలెగాక, దుస్తుయొక్క ఓపినింగు కొరకు కత్తిరింపబడిన అంచు. ఈ హెమ్ము యిక్ చేయబడి యుండును. గాన అంచువలనకూడ దీనిని ఫాల్స్ హెమ్మని పిలుతురు. యిది జెన్నీను కాలసు ప్లీటునందు మరియొక విధముగా నమర్చబడి యుండును. ఒకప్పుడు ఈ హెమ్మింగు విధానమును తెలిసికొనియుందురు. Broad Hem విధానములోవలెనే యిదియును వెడల్పుగా 1 1/2" వెడల్పుండి కుడిప్రక్క మరియొక పొరతో మూయబడి 1/4" కుట్టు వేయబడియుండును.

## Comming Out Band

పై పట్టీ ~~అడుగునయుండి~~ దుస్తుయొక్క ఓపినింగుకొరకు కత్తిరింపబడిన రెండవ అంచునకు 1/2 అం॥ వెడల్పున అతకబడిన పట్టీ. దీనిపై కాజాలను కుట్టి బత్తాములు తగిలించుటగాని, కేవలము ఈపట్టీ పై బత్తాములను కుట్టిగాని ఉండు తెరవును మూయుట కుపయోగించెదరు.

## Mending Darning & Patching

### మరామత్ — రప్పు మరియు మాసిక పనులు

### Simple Darning సామాన్య రప్పు తీత

గృహకృత్య సూదనమునందు రప్పు తీత మిక్కిలి ఉపయుక్తమైన పని. ఇది ఎల్లచోట్లయందును ఉపయోగపడును. క్రింద చూపబడిన 21 వ నెంబరు బొమ్మయందలి క్రింద చదరము రప్పుతీత విధాన

ము క్రింది సమకోణాకారము మాసిక విధానమును తెలియజేయు చున్నది. రఫ్ఫు చేయుటలో ఓపిక, జాగరూకత ఎక్కువ అవసరము.



మన ముఖ్యోపయోగపు దుస్తులలో ఒకేసవాసి, పలుచాడిపోయిన భాగములను రఫ్ఫు చేసినయెడల అవి దిట్టపడి కొన్నిదినములధికముగాను ఉపయోగపడును. ఈ విధముల రఫ్ఫులను చేయుటకు

Dia. No. 21.

దగ్గర దగ్గరగా కుట్లు వేయవలయును. ఈ పని చెప్పుడు చిరిగిన లేక చినిగిన బట్టయొక్క అడుగు భాగమునందే పెట్టవలసియుండును. దీనినే మరియొకవిధమైన Needle Weaving సూచీ వాయు మని యందురు. ఎవనగా ఉల్టాపైపున చిరిగిన లేక చినిగిన కన్నము దగ్గర క్రిందినుండి పైకి, పైనుండి క్రిందికి ఉల్టానుండి సీదాకు, సీదానుండి ఉల్టాకు పడుగు పేకల ననుసరించి సూదిని నడుపవలయును. రఫ్ఫు తీయునపుడు అంచులు దగ్గరకన్న సూదియొక్క ఒత్తిడి మధ్యభాగమునందు ఎక్కువగా నుండవలెను. ఎచ్చటనైతే యీ కుట్టుయొక్క అంచు ఒంపు తిరుగుచోట దారము వచ్చు (Loop) ను క్రింద విడిచిపెట్టవలయును. రఫ్ఫునందు నిలువు కుట్లు ముందు, తరువాత అడ్డకుట్లు వేయవలయును. ఇట్లు చేయుటలో నిలువుపోగులలో యొకటిదాని క్రిందినుండియు, రెండవ పోగు పైనుండియు నేత నేసినట్లుగా సూదిని నడిపి దారములను తీయ వలయును. దారము చివరలయందు లూపు వదలవలయును.

## Cross Darn కోణీసు రఫ్ఫు లేక ఏటవాలు రఫ్ఫు విధానము

అంకమైన వస్తువులనుంచు బల్లలపై పరచు అలంకృత బట్టలు సాధారణముగా అంచులవద్ద కోణీసుగా చిరుగుచుండును. అట్లు చిరిగిన రెండంచులను దగ్గరగా చేర్చి Edgetear మాదిరిగా ముందు కుట్టి పిమ్మట ఈ చిరిగినభాగ మంతయు రఫ్ఫు తీయవలెను.

## Darning on Knitted Fabric

### అల్లిక బట్టపై రఫ్ఫు తీత విధానము

అల్లిక దుస్తు లనగా స్వెట్టర్లు, కంఫర్టులు, మేజోళ్ళు, అల్లిక టోపీలు మొదలగునవి. ఇట్టి అల్లిక దుస్తులు సాధారణముగా మోకాళ్ళదగ్గర, మోచేతులవద్ద బట్ట పలుచబడిపోవుటగాని, పిగిలిపోవుటగాని, చిరిగిపోవుటగాని తటస్థించుచుండును. అట్టిచో ఆ దుస్తుయొక్క రంగుతో సరిపోవు రంగు వూలుముక్కను తీసికొని ఆ దుస్తుయొక్క అల్లికలోనుంచి క్రిందినుండి మీదికి, మీదినుండి క్రిందికి ఈ ఊలు ముక్కను నడుపవలయును. ఈ పని నెప్పుడుగాని, ఏ బట్టపై గాని ఉల్టావైపున నే చేయవలసియుండును.

అల్లిక దుస్తులలోని దారములు పోయి కన్నము కూడినట్లయిన వెంటనే దానికి రఫ్ఫు తీయవలయును. లేనియెడల ఒక దారము వెనుక మరియొక దారము పోయి క్రమేణా కన్నము పెద్ద దగును. అట్లు పెద్ద ది కాకమునుపే చిరిగిన స్థానమునందలి ఊలుపోగులయొక్క చివర పోగులను వాడియైన కత్తెరతో కత్తిరించి సమానముగా నుండునట్లు చూడవలయును. తరువాత పొడవైన సూదిని తీసికొని ఆ దుస్తుయొక్క రంగు ఊలుముక్కనందు జొనిపి కన్నమునకు 1/2 అంగుళము పైనుండి మొదలుపెట్టి పై విధానమున రఫ్ఫు తీయుటకు ప్రారంభింపవలయును.

అట్లు చేయుటలో ఆ ఊలుముక్కను ఈ అరంగుళములోనున్న ఒకొక్కక్క అల్లిక కన్నముద్వారా పోనీయవలయును. ఒక వరుస అయిన వెంటనే ఊలు లేక దారము చివర లూప్ వదులుచుండ వలయును. మధ్యకు వచ్చుసరికి కుట్లయొక్క ఒత్తిడి యెక్కువ చేయ వలయును. తదుపరి మధ్యనుండి రెండవ చివరకు వెళ్ళుసరికి క్రమ ముగా ఒత్తు తగ్గించవలయును. అట్లు చేయుటలో ఆ రఫ్ఫుతీతయొక్క ఆకారము వైమానువలె నుండును. ఇట్లు నిలువు కుట్లు పూర్తియైన తరువాత అడ్డంగా రఫ్ఫు తీయవలసిన కన్నమునకు రెండు వరుసల పై నుండి రఫ్ఫు తీయుటకు ప్రారంభించవలయును. ఈ అడ్డుదారములను నేత నేసినట్లు నిలువుదారములగుండా పోనీయవలయును.

## Patching మాసిక విధానము

## Hemmed Patching

మడత మాసిక రఫ్ఫు తీయుటకు వీలులేక మధ్య కొంతముక్క పోయియున్న పెద్దకన్నములకు రఫ్ఫు తీయుటకంటె మాసిక వేయు టయే మంచిది. మాసిక వేయుటకు సాధారణముగా క్రొత్త బట్ట నుప యోగించరాదు. అట్లు ఉపయోగించినయెడల మాసిక వేసిన క్రొత్త బట్టలోని ముక్క రేపు వేసినతరువాత దగ్గరగా ముడుచుకొనిపోయి చూచుట కసహ్యముగా నుండును. మాసిక వేయవలసివచ్చినప్పుడు చిరిగిన కన్నముకంటె మాసిక వేయు ముక్కను కొంచె మధికముగా కత్తిరించవలెను. దానియొక్క 4 అంచులను లోపలకు సన్నముగా మడచి ఆ మాసికను ఉల్టావైపుననే కుట్టవలయును. అప్పుడా మాసిక రంగు దుస్తుయొక్క రంగు యేమాత్రము తేడాయుండరాదు. అనగా ఒకటిగా నుండవలయును. మనము మాసిక వేయునట్టి ముక్క బట్ట యొక్క పడుగు పేకల ననుసరించి యుండవలయును.

## Flanel Patch ఫ్లానెల్ పాచ్

అంచులు ముడచి కుట్టినప్పుడు దళసరిగా నుండునని తోచెడి ప్రతి బట్టను మాసిక వేయునపుడు ఫ్లానల్ పాచ్ పద్ధతి ఉపయోగించవలసియుండవలెను. దళసరిగా నుండునని తోచినయెడల మాసిక ముక్క ప్రతి యంచును అక్షరా పక్షము 1/4 అం॥ కత్తిరించివైచి మాసిక వేయు బట్టను పడుగు పేకల ననుసరించి యుండునట్లు చూచి సరిపడు నంత బట్ట కత్తిరించి దానిపై వేసి కుట్టుటకు పూర్వము మాసికముక్క 4 అంచులను హెర్రింగు బోను స్టిచ్‌తో కుట్టవలయును. మన ముపయోగించెడి దారము బట్ట రంగుతో కలిసియుండునట్లుండవలెను. రాంగుసైడునకు త్రిప్పి పాచ్ అంచుభాగమును చుట్టు 4 వైపుల కత్తిరించి పై మాసిక వేసిన బట్టకు అంటీ అంటనట్లు Herring Bone కుట్టుతో అంచు చుట్టును కుట్టవలయును. మాసిక వేయు బట్టను మాసిక వేసినపిమ్మట తడిసినపుడు ముడుచుకొనిపోకుండగ మొదట సబ్బు నీళ్ళలో నానవేసి యెండబెట్టి యిస్త్రీ చేసి కత్తిరించవలెను.

## డామస్క్ పాచ్

ఒక పెద్దముక్క పోయినపుడు రఫ్ఫు తీయు పద్ధతిని ఉపయోగించుట ముఖ్యావసరము. మొదట మనము రఫ్ఫు తీయు దారములు నీటియందు రంగులో మునిగి చాకలికి వేసిన తరువాత క్రమేపి కనుపించుచుండును. ఎక్కువగా తడిపి యిస్త్రీచేసినముక్క మాసిక వేసిన మంచిది. ఆ రంగు బట్ట దొరకనప్పుడు మరియొక రకముగల బట్టను రంగులో రంగు కలసిన పడుగు పేకల ననుసరించి వేయవలెను. మాసికకొరకు కత్తిరించునట్టి ముక్క మాసిక రంధ్రముకంటె 1/2" అధికముగా నుండవలెను. మాసిక రంధ్రముపై మాసికవేయు బట్టనుంచి ముందు టాకీ చేసి రాంగు సైడు మాసికముక్క అంచును కత్తిరించి మాసికవేయు ముక్క అంచునకు 1/2" అధికముగా నుంచి అంచును

1/4" అంగుళము లోపలకు మడచి కత్తిరింపబడిన అంచునకు తగులు నట్లుగా Invisiable Hemming Stitch తో కుట్టవలెను. మనము కుట్టుటకు మొదలుపెట్టినపుడు బట్టయొక్క ఉల్టా రాంగుపైపున రంధ్రముయొక్క అంచులను పైకి లేవకుండగ Hemming కుట్టుతో కుట్టవలయును. మన యిదివరలో రఫ్ఫు తీసిన మాసికయొక్క దారపు మొలకలను బహు జాగరూకతతో కత్తిరించవలెను. మాసిక పూర్తియైన పిమ్మట వేడి యిస్త్రీపెట్టెతో బట్టను రాంగుపైపునకు త్రిప్పి అనగా మాసిక వేసిన ముక్కను అడుగునకు త్రిప్పి అణచియుంచ వలెను. ఇట్లు వేడియిస్త్రీపెట్టెలో అణచియుంచినయెడల మాసికయొక్క అంచులు సమానముగా అణగి పడుగు పేకలతో మిళితమై కుట్టిన కుట్లు కనిపించకుండ మనము వేసిన మాసికను కనుపించకుండగాచేయును.

## Pattern Patch

పువ్వులు లతలతో కూడిన బట్టపై మాసిక వేయవలసినయెడల సాధ్యమైనంతవరకు ఆ దుస్తుయొక్క కాలరుయొక్క అడుగుభాగము నందలిగాని, బెల్టుయొక్క అడుగుభాగమునందలిగాని డిజైను ననుస రించి కావలసినంత అవసరమైన వెడల్పు, పొడవులకు 1/2 అం॥ అధిక ముగా కత్తిరించి కుడిచేతియొక్క వ్రేళ్ళ నిపుణతతో 1/4 అంగుళము నలుప్రక్కల లోనికి వంచి పడుగు పేకల ననుసరించి బట్టయొక్క పై భాగమునందు మాసికవేయు ముక్కనుంచి ముందుగా టాకీ చేసి పిమ్మట స్లిప్ స్టిచ్ తో పూర్తి చేయవలెను. పిమ్మట వెనుకకు త్రిప్పి 4 ప్రక్కల మాసికను కత్తిరించి యా కత్తిరించిన అంచులను లోనికి జొనుపుచూ ఓవర్ కాస్టింగుతోగాని, బ్లాంకెట్ కుట్లతోగాని పూర్తి చేయవలెను. దీనినే పేటరన్ పాచ్ అందురు.

## Making Hems పట్టీలను పనిచేయు విధానము

ఈ పట్టీలను పనిచేయుటలో మాదిరీ లనేకములు గలవు. ఈ మాదిరీ లన్నియూ మనము చేయు పనినిబట్టియూ, బట్టయొక్క నాణ్యము ననుసరించియూ యుండును.

మామూలు హెమ్ము పనిచేయునపుడు Slip Stitch అను సులభమైన కుట్టు. గృహకృత్య సాధనమునందు మన స్వంతవస్తువులను చేతి రుమాళ్ళను తెరలను కుట్టునపుడు ఈ స్లిప్ స్టిచ్ నే అధికముగా వాడుదురు. ఒకప్పుడు ఏ బట్టనైనను అంచును వెడల్పుగాగాని, సన్నముగాగాని (Broad or Narrow Hem) గా మడచునపుడు బట్టయొక్క అంచుపై నిర్దేశింపబడిన వెడల్పును సమానముగా నుండునట్లు చూచుటకై అంచున కిరుప్రక్కల పదునైన కత్తెరతో అవసరమైనంత దూరములో ఆనవాలుగా కత్తిరించవలెను. తరువాత వెడల్పును




Dia. No 22.

మొదటి అంచునుండి రెండవఅంచుచివరవరకు మడతపెట్టి క్రీజెడ్జికి 1/2 అం॥ దూరములో పొడవుగా పిన్ చేయవలెను. రాఎడ్జియొక్క అంచును సన్నముగా లోపలకు వంచి ఎడమచేతి వ్రేళ్ళతో అణచిపెట్టి పనిచేసిగాని, టాకీ కుట్టుతోగాని అణచియుంచవలెను. తరువాత ఎడమనుండి కుడికి బట్టయందు లీనమగు రంగుదారముతో స్లిప్‌స్టిచ్ వేయుచూ హెమ్మును పనిచేసి ముగింపవలెను. తరువాత తాత్కాలికపు టాకీ కుట్లను తీసివేసి, మొదట టాకీ కుట్లవలనను పిన్ చేయుటవలనను హెమ్ముపై పడిన ఆనవాళ్ళను కలిసిపోవునట్లుగా వేడియిస్త్రీపెట్టెతో యిస్త్రీ చేయవలెను.

## Pressing A Hem పట్టీని అణచియుంచు విధానము

ఈ విధానము జయప్రదమైనట్టియు, బహుజాగరూకతతో కూడినట్టియు మడువుపై ఆధారపడి బహుసున్నితమైన కుట్లతో కూడియుండును. లంగాలు, డ్రెస్సులు, కోట్లపైననూ మన ముపయోగించెడి

హెమ్మునెయొక్క అంచును కట్టుటలో దారమును లాగి బిగించి కుట్టవల సిన రాంగుసైడుయొక్క అంచుపైన కనుపించునట్లు పట్టీ పొడవునా ఒక ఎత్తయిన ఆనవాలుగా ఏర్పడుచుండును. ఈ ఆనవాలు సాధారణముగా ఉన్ని మస్తులయందును, జరిగరి బట్టలయందును తరుచుగా కనుపించును. సాధ్యమైనంతవరకు అట్టి ఆనవాలు కనుపించకుండ కుట్టుట ముఖ్యావసరము. దీనిని కనుపించకుండ చేయవలెననిన ఉన్ని దుస్తులయొక్క హెమ్మును పనిచేయునప్పుడు బట్ట 3 పొరలుగా నుండును. గాన స్లిప్‌స్టిచ్‌తో పనిచేయునప్పుడు సూదియందు గల దారమును గట్టిగా లాగకుండ అవసరమైనంత బిగువుతో పనిచేసినయెడల మనము పై చెప్పినటువంటి బట్ట పైభాగమున పడు ఆనవాళ్ళు అదృశ్య మగును.

మనము పనిచేయునట్టి హెమ్ము తిన్నగా నిలువుగా నుండినను వలయాకారములో నుండినను దానిని బల్లపై నుంచునపుడు అడుగు భాగము పై నుండునట్లుగాను, సీదా అడుగున నుండునట్లుగాను బల్లపై నుంచి యిస్త్రీపెట్టెతో బహుజాగరూకతతో బట్టపై ప్రసరింపజేయునపుడు యివరలో మనము వదులుగా పనిచేసిన హెమ్మింగు కుట్లను వాటి వాటి స్థానమునుండి చలింపకుండునట్లు చూచి అణచిపెట్టవలెను.

## Bound Hem

ఒక అంచును కట్ ఫ్లాన్నుతో రాంగుసైడునకు త్రిప్పి బంధి పబడిన పట్టీ మొదటి పద్ధతి. ఇది చదును పట్టీలను తయారుచేయు పద్ధతులలో నొక సులభశైలి (మంచి పద్ధతి). మనము ప్రత్యేకము అంచు కత్తిరించిన వెంటనే పోగులు విడిపోయి చెల్లాచెదరగు ఉన్నిబట్టలపై ఈ పద్ధతిని ఉపయోగించుట ముఖ్యము. అనగా ప్యారిస్ బైండింగును గాని, సిల్కు టేపునుగాని మనము పనిచేయు ఉన్నిబట్టయొక్క కత్తిరింపబడి చెల్లాచెదరైన పోగులతో కూడిన అంచుపైనుంచి సీదాకు సీదాను చేర్చి అంచునకు 1/4 అం॥ పైన నున్నితమైన రన్నింగ్

స్టిచ్ తోగాని, బాక్ స్టిచ్ తోగాని అంచు పొడవునా కుట్టి పూర్తియైన పిమ్మట సిల్కు టేపును అవసరమైనంత వెడల్పును పట్టీ మడచి మనము కుట్టిన అంచును డ్రెస్సు గోళ్ళతో అనుగుణకు త్రిప్పి టాక్ కుట్టుతో మొదట పట్టీని తయారుచేసి పై అంచును పొడవునా పిన్ చేయవలెను. తరువాత Herring Bone Stitch తో పనిని ముగించవలెను మనము పనిచేసిన బట్ట ఉన్నిదైనందున చదునుగా చేయుటకు వేడి యిస్త్రీ పెట్టెతో ఈ మడతపై తడిబట్టను వేసి అణచి కొంతకాల ముంచిన యెడల బట్టయందలి తడిని లాగుకొని Hem ను చదునుగా నుండునట్లు చేయును.

# SECOND METHOD

## Bound Hem

మనము పనిచేయు బట్ట ఉన్నిదైనను లేక దళసరిదైనను అవసరమైనంతవరకు పట్టీని తయారుచేసి దుస్తుయొక్క అడుగు భాగమును అంచును మడచుటవలన 3 పొరలు ఏర్పడుచున్నవి. గాన అదృశ్య సూదనముతో సీదావైపునకు కనుపించకుండునట్లును ఈ అంచుయొక్క ఆనవాలు దుస్తుయొక్క పై భాగమును ఆనవాలు ఏర్పడకుండునట్లును బహుసున్నితమైన కుట్లతో బట్టయొక్క దళసరితనమునకు హాని కలుగకుండ పూర్తిచేసి పై చెప్పిన మొదటి పద్ధతిలో ప్రకారము పట్టీపై తడిబట్టనుంచి వేడి యిస్త్రీ పెట్టెతో అణచి యుంచవలెను. యిస్త్రీ పెట్టె పని చాల కష్టతరమైన పనితనమునుండి తప్పించుకొనవలె ననిన ట్వీడ్ బట్టలపైనను, బరువైన ఉన్నిబట్టలపైనను యిస్త్రిని నుపయోగించునపుడు ప్రత్యేక శ్రద్ధ నవలంభించుట ముఖ్యావసరము. ఒకప్పుడు మనము పనిచేయు పట్టీ బట్టయొక్క కర్ణాకారములో నుండినను (Diagnal) ప్యారిస్ బైండింగ్ టేపుతో సిల్కు టేపుతో కూడిన అంచును యిస్త్రీచేయునపుడుగానిసాదాబట్టలపైనను, సిల్కు బట్టలపైనను అడ్డ

ముగా కత్తిరించబడిన అతుకులను యిస్త్రీచేయునపుడు సీదావైపునకు కనుపించకుండ రన్నింగ్ స్టిచ్ నే ఉపయోగించవలెను.

పై చెప్పిన అంచులను యిస్త్రీ చేయునపుడు ఒక బల్లపైగాని, ఒక కార్డుబోర్డుపైగాని మనము యిస్త్రీ చేయవలసిన పై రకపు బట్ట యొక్క హెమ్ములను అడుగుభాగమును పై నుంచి హెమ్మెయొక్క అడుగుభాగము సీదావైపున నుండునట్లు చూచి కుట్లు చలించకుండ బట్టను సాగనీయకుండ బహుసున్నితముగా పట్టీపై తడిబట్ట నుంచి యిస్త్రీతో పనిచేయవలెను.

అంచునకు బైండింగు వేసి పూర్తిచేసినతరువాత మనముచేసిన పనిని అడుగుభాగమునకు అంచు మీదుగా వ్రేళ్ళగోళ్ళతో త్రిప్పి అంచును మడచి ఒక 1/4 అం॥ పైన పొడవుగా పిన్ చేయవలెను. దీనిని వెనుక కుట్టుతో పనిచేయుచూ పోవునపుడు ఒకదానివెనుక నొక దానిని యుదివరలో మనము చేసిన పిన్నులను తీయుచూ పోవలెను. అంచును చక్కగా చేతితో తాత్కాలికముగా ఎడమచేతితో అణచి యుంచి పై చెప్పిన పద్ధతిలో తడిగుడ్డపై యిస్త్రీ చేయుచూ పోయిన యెడల చదునైన పట్టీగా తయారగును.

## Running Hem

దీనిని ముఖ్యముగా గృహమునం దుపయోగింపబడు తెలగడా గలేబులయొక్కయు, కుషనులయొక్కయు, సన్నని గాజ్ బట్టలయొక్కయు, (Bed Sheats) దుప్పట్లయొక్కయు అంచులను పనిచేయునపుడును, మరియు గృహకృత్యమునకు సంబంధించిన ప్రతి దుస్తుయొక్కయు, అంచులయొక్క పట్టీలను తయారుచేయునపుడు ఎక్కడతొందర కుట్లు, బలమైన కుట్లు అవసరమో, ఎక్కడెక్కడ సీదావైపు కనుపించని కుట్లు అవసరమో, మరియు ఎచ్చోట సీదావైపునకు ప్రత్యేకముగా కుట్లు కనుపించుట అవసరమో అచ్చటచ్చట ఈ Running Hem అవసరము.

ఇట్టి హెమ్ములను తయారుచేయునప్పుడు పై చెప్పిన పద్ధతులలో నేదైన నొకదాని నుపయోగించి పట్టీని సిద్ధముచేయును. అది యొకప్పుడు బహుసన్నదిగా తయారుచేయవలసివచ్చినప్పుడు మెజరింగ్ గైడ్ నుపయోగించుచూ అవసరమైనంత వెడల్పుపట్టీని మొదట టాకీ కుట్టుతో అంచుయొక్క కొంచెము దూరములో కుట్టి దళసరిగా నున్న అంచును పొడవునా రన్నింగ్ కుట్లతో కుట్టుచూపోవలయును.

## Herring Bone Hem

మందము దళసరిబట్టయొక్క అంచుగా ఇదివరలో చెప్పినట్లు పదునైన కత్తెరతో అంచులను కత్తిరించిన వెంటనేగాని, తరువాతగాని విడిపోని పోగులతో నున్నటువంటి అంచులను Broad or Narrow Hem చేయునపుడు రావెడ్జియొక్క అంచును సూక్ష్మబుద్ధితో ఎడమ చేతి చూపుడు బొటనవ్రేళ్ళ గోళ్ళతో బట్టను సన్నముగా అడుగునకు వంచి టాకీకుట్టుతో మొదట బంధించి తరువాత Herring Bone Stitch నుపయోగించుట తెలివైన పద్ధతి.



Dia. No. 23.

తరువాత అంచును మడత పెట్టునపుడు మెజరింగ్ గైడ్ నుపయోగించుచూ పోయి బట్టయొక్క అడుగు భాగమున టాకీ కుట్టుతో పట్టి బహు తేలికగా Herring Bone Stitch తో కుట్టిన అంచును చెదరనీయక ప్రత్యేక శ్రద్ధను వహించి సీదావైపునకు కుట్లు కనుపించకుండునట్లు యిస్త్రీతో పనిచేయవలెను.

## Rolled Hem

ఎడమచేతి చూపుడు బొటనవ్రేళ్ళమధ్య బహు నేర్పరితనముతో చుట్టబడి బహుసన్నమైన హెమ్మును సాధారణముగా బహుమృదువైన బట్టతో తయారగునట్టి దుస్తులయొక్క సన్నని అంచులపైనను, చేతిరుమాళ్ళ అంచులపైనను, తువ్వాళ్ళ అంచులపైనను, ఫ్రిల్స

అంచులయందును, మరియు బహుశన్నని బట్టల అంచులపైనను, అది యునుగాక ఎడమచేతి చూపుడు బొటనవ్రేళ్ళతో చుట్టబడునట్టి ప్రతి బట్టయొక్క అంచుపైన ఉపయోగించుదురు.

ఇట్టి అంచులను పనిచేయుటకు మొదలుపెట్టుటకు పూర్వము అంచును పదునైన కత్తెరతో కర్ణాకారములోగాని, బట్టయొక్క అడ్డములోగాని, నిలువులోగాని కత్తిరించి ఎడమచేతియొక్క చూపుడు బొటనవ్రేళ్ళ నుపయోగించి అంచును బహు నేర్పరితనముతో నీవైపు నకు దొర్లించి సిద్ధముగా నుండునట్లును, కుట్టుటకు వీలగునట్టి స్థితిలో నుండునట్లు కుడిచేతి చూపుడు బొటన వ్రేళ్ళతో నొక్కుచూపోయి, ఎడమచేతిని క్రమముగా నడపుచూపోయి పై చెప్పిన పద్ధతిలో హెమ్మును తయారుచేసి కుట్టుటకు సిద్ధముగా నుంచవలెను.

దీనిని కుట్టవలయు ననిన మొదట సూదియందు దారము బట్ట యొక్క రంగులో కలియునట్లు ఒంటిపోరలో వేసి చివర ముడివైచి సూదిని ప్రస్తుతము సిద్ధముగా నుంచబడిన హెమ్ముయొక్క దళసరి భాగముద్వారా పోవునట్లు సూదిని పోనిచ్చి బట్టయొక్క అడుగుభాగ మునకుగాని, పైభాగమునకుగాని కుట్లు కనుపించకుండ దారమును ప్రతి కుట్టునకు 2 సార్లు త్రిప్పి బిగించుచూ, కుట్టునకు కుట్టునకు పాతి కంగుళము దూర ముండునట్లు చూచి ఆలుచిప్ప అంచు భాగ మేర్పడు నట్లు కుట్టుచూ పోవలయును.

ఈ విధముగా కుట్టుచూపోయిన యెడల అంచు తనంతట తానే అదృశ్యమైన కుట్లవలన నేర్పడు అందమైన అంచుగా తయారగును. ఈ యంచునే ఒక విధముగా అలంకారపు అంచుగా తయారుచేయవలె ననిన పై చెప్పినట్లు దొర్లింపబడిన అంచుగా తయారుచేసి సిద్ధముగా నుంచబడిన బట్టపై సీదావైపున ఇదివరలో చెప్పినట్లు కుట్టుచూపోవల యును. తరువాత రైటుసైడునకు అంచును త్రిప్పి యిస్త్రీ చేయవలెను,

# French Hem

ఒక అందమైనట్టియు, సులువుగా పనిచేయునట్టియు, హెమ్ములలో నొకటియైయుండి సన్నని బైండింగును పోలియుండును. ఇది ముఖ్యముగా బహు: సున్నితమైన బట్టలపై సిల్కు, క్రేపు, జార్జెటు, షిఫాన్ను మొదలగునవి కత్తిరించిన వెంటనే విడిపోవు పోగులతో కూడిన అంచులను బైండింగు చేయుటకై ఉపయోగింతురు. సాధారణముగా దీనిని Bias Cut పైని సర్క్యులర్ ఎడ్జెస్ పైనను ఉపయోగింతురు. కాని స్కాలప్సుగాని, పాయింట్సుగాని ఉపయోగింపబడదు. దీనిని పని చేయు విధానము రోల్డు హెమ్మునే పోలియుండి బట్టయొక్క పై భాగమున కనుపించుచూ 1/2 అం॥ వెడల్పుమాత్రము ముండును.

మొదట కత్తిరింపబడిన దుస్తుయొక్క అంచునకు 1/2 అం॥ వెడల్పుగల ఎక్రాస్ కట్ ప్లైన్సును మధ్యకు సమానముగా మడచి 1/4 అం॥ వెడల్పుకు మూచి ఈ యంచును కత్తిరింపబడిన అంచునకు రాంగుసైడున చేర్చి 1/8" దూరములో నీట్ రన్నింగ్ స్టిచ్ తో కుట్టి బట్టయొక్క రైటుసైడునకు చేర్చి త్రిప్పి కావలసినంత వెడల్పునకు హెమ్మును ఫోల్డ్ చేసి టాకీకుట్లతో బంధించి Back Stitch తో బైండింగ్ యొక్క అంచుపై కుట్టి ముగింపవలయును. దీనిని వలయాకారపు అంచును పనిచేయునపుడు బట్టను సాగదీయుటలోను, ప్రెస్ చేయుటలోను ప్రత్యేకపు శ్రద్ధ వహింపవలసియుండును. ఇదివరలో చెప్పినట్లు వలయాకారపు అంచును వెడల్పు పట్టీతో కట్టవలసియుండునేని మొదట చాల జాగరూకతతో అవసరమైనంత వెడల్పును చేతివ్రేళ్ళయొక్క నిపుణతతో అణచి అచ్చటచ్చట అవసరమైన చోట్లయందు పిన్ను చేసి, టాకీ కుట్లతో కుట్టి స్లిప్ స్టిచ్ తో ముగింపవలెను. దీనిని చదునుగా చేయుటకొరకై వేడి యిస్త్రీపెట్టె నుపయోగించి కుట్లను కదలనీయక మడతలు; డార్టులు మాదిరిగా చదరపడనీయక బహు సున్నితముగా అణచియుంచవలెను. అనంతరము టాకీ కుట్లను, పిన్ను

లను తీసివైచి మరియొకసారి పిటీలన హెమ్మునయొక్క పైభాగ మున కలిగిన అనవాళ్ళనుబట్టి యందు లేకుండునట్లు మరియొకసారి యిస్త్రీ చేయుము.

## Straight Faced Hem నఖిలీ పట్టీ కుట్టు

ఒకప్పుడు దుస్తుయొక్క చేతులనుగాని, కాళ్ళనుగాని, వస్త్రాల యొక్క పొడవునుగాని పొడిగించవలసియుండునప్పుడు దానికి అవసర మైన బట్ట లేనపుడు నఖిలీ పట్టీని ఉపయోగించెదరు.

ఈనఖిలీపట్టీలను ఉపయోగించునపుడు సిల్కునుగాని, రెయాన్ క్లాత్ నుగాని ఉపయోగించుట ఉచితము. మొదట పొడిగించవలసిన వెడల్పునకు కొంచెము అధికముగా పట్టీని కత్తిరించి దుస్తుయొక్క అంచునకు సీదాకు సీదా చేర్చి 1/4 అం॥ వెడల్పున గట్టికుట్టుతోగాని, దన్నింగుకుట్టుగాని కుట్టి రెండుసైడులను త్రిప్పి మనము కుట్టిన అంచును లోనికి 1/4 అంగుళము అడుగునకు పోవునట్లు చూచి పట్టీని వ్రేళ్ళతో సాఫుచేసి మొదట టాకీ ఉపయోగించి Slip Stitch తో కుట్టి పూర్తి చేయవలెను.

ఈ మాదిరి నఖిలీపట్టీలను తయారుచేయుటలో ఇదియొక మంచి ఉద్దేశము. వెల్వెటు- ముఖమల్ బట్టలకు, దానిని పోలిన బట్టలకు, సిల్కుపీలికలనేగాని మరియొక బట్టను ఉపయోగించరాదు.

## Faced Hem Circular వలయాకారపు నఖిలీ పట్టీ

పై చెప్పిన Straight Hem లో మాదిరిగా కుట్టవచ్చునుగాని మన ముపయోగించునట్టి ఫేసింగ్ పట్టీ మాత్రము Bias Cut లో నుండవలెను.

మొదట పనిచేయునపుడు అనగా నఖిలీ పట్టీపై టాకీ కుట్లను వేయునపుడు దుస్తును చదునుగా నొక బల్లపై పరచి అడుగుభాగము పై కుండునట్లు చూచి టాకీ వేయునపుడు, పట్టీని సాఫు చేయునపుడు,

పట్టీయొక్క ఆకారము చెడకుండనుండునట్లు చూచుటలో బహు జాగ్రత్తగా నుండవలెను. ఈ Bias Cut తో కూడిన సిల్కుఅంచును 1/4 అం॥ పై కుండునట్లు చూచి బట్టను సాగనీయకుండ యిస్త్రీపెట్టె యొక్క ముందుభాగముతో జాగ్రత్తగా అణచిపెట్టుచూపోయి తరువాత అధికముగా నుండిన సిల్కుపట్టీయొక్క భాగమును వ్రేళ్ళతో చదునుచేసి యీ రాఎడ్జిని వ్రేళ్ళగోళ్ళతో 1/4 అంగుళము లోపునకు పోనిచ్చి Pin చేసి కిన్నులకు పైన 1/2 అంగుళముపైన టాకీ కుట్లతో కుట్టి తరువాత Slip Stitch తో ముగించి యిస్త్రీ చేయవలెను.

## Decorative Faced Hem

ఈ అలంకారముతో కూడిన పట్టీని పనిచేయుట పై పద్ధతులనే అవలంభించుచు, పట్టీనిమడతపెట్టుటలో పూర్వమువలె అడుగుభాగమునకుగాక అంచును పై భాగమునకు మడతపెట్టవలెను. మనము పని చేయు తిన్ననైనయెడల మనము పనిచేయబోవు నఖలీపట్టీకూడ Bias Cut గాని, Across Cut గాని కాక, బట్టయొక్క పడుగు పేకలలో నేవైపునైనను కత్తిరింపబడునట్టి పీలికగా నుండవచ్చును. ఒకవ్పుడు ఈ అలంకారముతో కూడిన అంచు వలయాకారములో నుండినయెడల బయ్యాస్ కట్ నే ఉపయోగించవలెను. మొదట మన ముపయోగించెడి నఖలీ పట్టీని Straight గాని, Bias Cut లో గాని ఉన్ననూ, రాఎడ్జియొక్క అంచును వ్రేళ్ళ నిపుణతతో 1/4 అం॥ లోపునకు వంచి సాపుచేసి యీ మడత పెట్టబడిన అంచును దుస్తుయొక్క సీదావైపునకు మడతపెట్టబడిన అంచుపై సమాన దూరములో నుంచి పొడవునా టాకీకుట్లతో కుట్టవలెను. రెండింటిని కలిపి 1/4 అంగుళము దూరములో రన్నింగు కుట్టుతో కుట్టి టాకీ తీసివేయువలెను. పూర్తియైన పనిని దుస్తుయొక్క అడుగుభాగమునకు త్రిప్పి అంచుపొడవునా అవసరమైనంత వెడల్పు మడచి సమానమైన వెడల్పుతో నుండునట్లు చూచి Slip Stitch తో ముగింపవలెను.

## Second Method

మనము పనిచేయు దుస్తుయొక్క రంగునకు వ్యతిరేకమైన రంగుబట్టలో క్రాస్ స్ట్రిప్సు కత్తిరించి స్కాలప్డుగా నుండినను, పోయంటెడ్ గా నుండినను మొదటి పద్ధతి నవలంభించుచు 1/2 అం। వెడల్పునకు తక్కువ కాకుండగా నుండునట్లు చూచి Hem ను పని చేయవలెను. ఒకప్పుడు ఈ అంచు స్కాలప్డుగా నుండినను అంచులు చదునుగా చేసి ముగింపవలెను.

## Circular Hem వలయాకారపు పట్టీ కుట్టు

ఫ్రాక్ యొక్క క్రాస్ గా కత్తిరింపబడిన స్కర్టులకు Bias Cut Skirt లకు, Round Table Cloths కు పై భాగమున చూడగలము. దీనిని పనిచేయుటలో ప్రత్యేకపు శ్రద్ధ వహించవలసియుండును. ఎందుచేత ననగా వలయాకారపు పట్టీ తయారుచేయునపుడు మొదట మనము కుట్టవలసిన పట్టీయొక్క వెడల్పు ఎంత యుండవలయునో సరిచూచి మొదట పెన్సిలుతో మార్కుచేసి లైను వెంబడినే బహు సున్నితముగా ఎడమచేతి చూపుడు బొటనవ్రేలితో చదును చేయుచు లైను చెడకుండగా పూర్తియైన పిమ్మట టాకీ కుట్టుతో మడువబడిన అంచునకు 1/4 అంగుళము క్రిందుగా కుట్టవలెను. పెన్సిలుతో మార్కు చేసిన గీత వెంబడి మడత వేయగా హెచ్చువచ్చిన భాగమును ప్రతి 1/2 అంగుళమునకు డార్టులరూపమున మడతపెట్టి ప్రతి డార్టునకు పిన్ చేయవలెను. పిమ్మట రాఎడ్జిని లోపునకు గోళ్ళతో మడచి అంచు వెంబడినే టాకీకుట్టుతో మొదట వేసినట్లు ముగింపవలెను. పిమ్మట మడతలు లేకుండ యిస్త్రీ పెట్టెతో అణచియుంచిన బట్టయొక్క చదునులో లీనమై చూపునకు అందముగా కన్పట్టును.

# BUTTON HOLES కాజాలు వాని రకములు

## Simple Button Hole సామాన్య కాజా కుట్టు

ఇది స్కాలప్పులతో కూడిన కుట్టు. స్కాలప్పు లనగా సూదిని క్రిందనుంచి పైకి గ్రుచ్చి చేతిలోనున్న దారమును సూది మొనపై నుండి దారమును త్రిప్పి సూదిని పైకి లాగిన నొకవిధమైన ముడి యేర్పడును. దీనినే స్కాలప్పు అందురు.

### ఈ కుట్లయొక్క ఉపయోగము

A

B

C

Dia. No. 24.

పై 24 వ నంబరు పటమును చూడుము. దీని యందు A B C గుర్తులతో 3 కుట్లు గలవు. అందలి A B లు యీ కట్టునకు సంబంధించినవి. మొదటిది ఐలెట్ బటన్ హోల్ కాజా కుట్లు. ఈ సాధారణమైన కాజాకట్టు రేగియున్న బట్ట అంచులను దిట్ట పరచుటకును Ropes త్రాళ్ళయొక్క కత్తిరింపబడి రేగియున్న కొసలను గట్టిపరచుటకును ఉపయోగించెదరు.

### కాజాను కుట్టు పద్ధతి

దుస్తుయొక్క అవసరమైన భాగమునందు కాజాను శాస్త్రీయ పద్ధతిని కత్తిరించి యెడమ పై భాగమునందు అంచునకు కొలదిదూరములో అనగా 1/16" దూరములో సూదిని గ్రుచ్చి పైకి లాగి దారమును మొనకు చుట్టి పైకి తీయగా వచ్చిన ముడిని అంచునకు క్రింది భాగమున బిగించి యీ విధముగానే తలవెంట్రుకవాసి దగ్గరదగ్గరగా స్కాలప్పు వేయుచూ పోయి తిరిగి మొదలుపెట్టిన స్థానమునకు రాగా కాజాయొక్క రెండంచులను కలిపి మూడు లేక నాలుగు స్కాలప్పులను వేసి కాజాను పూర్తిచేయవలయును.

## Blancket Stitch బొంత కుట్టు

ఇదియును కాజాకుట్టునే పోలియుండును. కాని కుట్టునకు కుట్టునకు మధ్యదూరము హెచ్చుగా నుండును.

## Tailors' Button Hole దర్జీవారి కాజా కుట్టు

దీనినే Standard Button Hole Stitch అనికూడ అందురు. దీనిని మొదట సూదియందు 20" పొడవుగల ఒంటిపేట దారమునువేసి చివర సన్నని ముడి వైచి పైచెప్పిన స్కాలప్పు లేకుండగా అనగా సూదిపైనుండి దారమును త్రిప్పకయే ordinary whipping stitch తో కుడినుండి మొదలుపెట్టి కాజా కేసియున్న అంచులను కట్టుచూ పోయి ఆ పని పూర్తియైన తరువాత సూదియందు రెండుపేటల దారమును మొదట చెప్పిన పొడవుతో నెక్కించి చివర ముడివైచి తిరిగి Simple Button Hole బటన్ హోల్‌వలెనే స్కాలప్పులతో పూర్తిచేసిన దిట్టమైన కాజా యేర్పడును. అదియే పై 24 వ నెంబరు నందు చూపబడిన B గుర్తు కాజా.

## Bound Button Hole

నవీన యుగమునందు కాజాలను కుట్టు పద్ధతి బహు అందమైన విధానములలో మారి కొన్ని సంవత్సరములకు పూర్వమునుండియే స్త్రీ దుస్తులపై అధికముగా వాడబడుచున్నది. ఇదివరలో ఈ పద్ధతి నవలంభించినయెడల మొదట దుస్తుపై ప్రయోగించుటకు పూర్వము పాతకోటుగుడ్డ ముక్కలపై అలవాటు చేయుట మంచిది.

దుస్తుయొక్క కాజా కుట్టవలసిన స్థానమునందు పై భాగమున గుండీయొక్క వెడల్పును పిన్నులతో మార్కుచేసి మొదటి పిన్ను నుండి రెండవ పిన్నువరకు టాకీకుట్టుతో కత్తిరించవలసిన స్థానమును గుర్తించవలెను. పిమ్మట ఆ గుర్తుపై యిరుప్రక్కల 1 1/2 అం॥ నుండి 2 అం॥ ల వరకు వెడల్పు గలిగినట్టియు, ఒక అంగుళము లోతు

గలిగినట్టియు, దుస్తునకు సంబంధించిన బట్టముక్కను పదునైన కత్తెరతో పై చెప్పిన కొలగల ప్రకారము కత్తిరించి గుర్తించిన ఆనవాలునకు సమాన దూరములో నుండునట్లుగా యీ ఫేసింగును వేసి అంచునకు 1/8" దూరములో నలుప్రక్కల టాకీకుట్టుతో కుట్టి బంధింపవలెను. తరువాత దుస్తును అడుగుభాగమునుండి పైకి త్రిప్పి మొదట బత్తాముయొక్క వెడల్పును టాకీకుట్టుతో మార్కు చేసిన ఆనవాలునకు యిరుప్రక్కల 1/8" దూరములో సీట్ రన్నింగ్‌తో కుట్టి మొట్ట మొదట కుట్టిన సెంటరులోగల టాకీకుట్టుద్వారా పదునైన కత్తెరతో కత్తిరించి ఫేసింగునకు నలుప్రక్కల కుట్టిన టాకీకుట్టును తీసివైచి దుస్తుయొక్క అడుగుభాగమునకు చేతివ్రేళ్ళ నిపుణతతో కాజా అంచులయొక్క తిన్నవైన వరుసలను చెడనీయక బహుజాగరూకతతో అడుగునకు త్రిప్పి Slip Stitch తో గాని, ఫ్రిక్ స్టిచ్‌తోగాని మడత పెట్టబడిన కాజాయొక్క అంచులచుట్టు చుట్టి సూది అడుగునకు పోయి కుట్లు అడుగునకు కన్పించినను, కాజాయొక్క పైభాగమునమాత్రము కనుపించకుండ కుట్టవలెను. పిమ్మట తయారైన కాజాపై తడిబట్ట నుంచి వేడి యిస్త్రీతో సమానముగా అణచి యుంచవలెను. కొంతసేపైన పిమ్మట అడుగునకు త్రిప్పబడిన ఫేసింగ్‌యొక్క నలుప్రక్కల అంచులను Herring Bone Stitch తో కుట్టి రైటుసైడును త్రిప్పి బటన్ హోల్‌యొక్క ఓపెనింగ్ స్కాలప్స్‌తో కుట్టి ముగింపవలెను.

## Button Hole with Rounded End

### గుండ్రని ఆకారము కలిగిన కాజా

మొదట యీ గుండ్రని మూల కలిగిన కాజాను ఒక చిన్న గుడ్డముక్కపై కత్తిరించి మొదట చెప్పిన కాజా కుట్టు విధానమున గుండ్రని మూలవద్ద బహు జాగరూకతతో ఆకారము చెడకుండగా దారమును బిగించుచూ పోవలయును. రెండవమూల అనగా మొదలు

పెట్టినచోట రెండంచులను దగ్గరగా లాగి రెండుసార్లు దారమును చుట్టి ముడివైచి కత్తిరించవలయును. కాజాపేయు ప్రతివారును బట్ట యొక్క రంగులో కలియు దారము నుపయోగించుట యుక్తము. దీనినే ఐలెట్ బటన్ హోల్ అనికూడ పిలుతురు. (Dia. No. 24 A.)

## Button Hole for Over Coats, Ulstus, Cloaks Etc.

### ఓవరు లేక వానకోట్లు మొదలుగాగల పెద్దపెద్ద బరువుగల దుస్తులకు వేయు కాజా

పై చెప్పినట్లు దుస్తులు వశసరియై బరువు గలిగి వున్నితోను, కాన్వాసుతోను, బట్టవలెనుండు రబ్బరుతోను యంత్రసహాయమున తయారై పెద్దవిగా నుండుటవలన వాటికి తగినట్లుగా పెద్ద గుండీలు, వాటికి సరిపడు కాజాలు తగినంత గట్టితనముతోను, పనితనముతోను పూర్తిచేయవలసియున్నది. గాన యీ కాజాకుట్టు విధానము అద్భుతముగా నుండును. కాజా ఎప్పుడును గుండీయొక్క అడ్డుకొలతకు 1/4" అధికముగా నుండవలయును. కాజాయొక్క కుడివైపున తగిలించినపుడు గుండీయుండెడి స్థానమునందు ముక్కోణాకారముగా గాని, గుండ్రని ఆకారముగాగాని యుండవలయును. కాజా కుట్టునపుడు గుండ్రని ఆకారము చెడకుండ చూచి కుట్టవలెను. ఈ మాదిరి కాజాలను దుస్తుయొక్క రంగుగల క్రాస్ పీలికతో 1/4" వెడల్పు గలిగిన క్రాస్ పీలికతో సీదావైపు కాజాయంచుమీదనే పెట్టి చుట్టును కుట్టవలయును. కనుపించని చేతినిపుణత కలిగిన కుట్టుతో ముగించవలయును.

## Twisted Button Hole

మామూలుగా పై చెప్పినట్లు కాజాను కత్తిరించి స్కాలపు వేయునపుడు సూదిపై 2 సార్లు దారము చుట్టి పైకి లాగిన ఒక విధమైన ముడి యేర్పడును. ఇట్లు కాజా నంతటిని పూర్తిచేయుట మరి

గొక పద్ధతి. దీనిని దర్జీలు తరుచు కాజాలు కుట్టునపుడు ఉపయోగింతురు. దీనినే ట్విస్టెడ్ బటన్ హోల్ అందురు.

## యోక్సు: 3 రకములు

1 షార్టుయోక్ 2 డీప్‌యోక్ 3 షాడిల్‌యోక్

### 1 షార్టుయోక్ (Nape)

మెడగుంటయందు వెనుప్రూసయొక్క మొదటి పూసకు నేప్ అందురు. ఈ నేప్‌నుండి వెనుపూసమీదుగా క్రిందికి 3 అంగుళములకు తక్కువకాని వెడల్పుతో కూడిన షోల్డర్ పీస్‌ను Short Yoke అందురు. దీనినే Small Yoke అని యందురు.

### 2 Deep Yoke

పైన చెప్పిన మాదిరిగా నేప్‌నుండి వెనుప్రూసమీదుగా క్రిందికి చాతీ చుట్టుకొలతలో 4 వ వంతు వెడల్పునకు తక్కువగాని వెనుక ముందు గల షోల్డర్ పీస్‌లను డీప్ యోక్ అందురు. ఈ పైన చెప్పిన రెండింటికిని భుజముపై షోల్డర్ జాయింటు కుట్టు ఉండవలెను.

### 3 Shadle Yoke

ఈ రెండు విధానములలో నేపద్ధతిగాని వెడల్పులోగాని కత్తిరించినను భుజముపై కుట్టు యుండరాదు. అట్టిదానిని సాడిల్ యోక్ అందురు. మిగతా ఫాషను లన్నియు మన యిష్టప్రకారము చేసికొనవచ్చును.

## TUNICS 3 రకములు గలవు

### 1 ప్లైన్ ట్యూనిక్సు 2 Smoked Tunic 3 Slashed Tunic

### 1 ప్లైన్ ట్యూనిక్

ట్యూనిక్ అనగా చంటిబిడ్డలకు ధరింపజేయునట్టి వదులైన దుస్తు. (Loose Garment)

## Block Pattern బ్లాక్ పాటరన్

అనగా మొదట దుస్తువకు అవసరమైన కొలతల ననుసరించి మొదట కాగితముపై శాస్త్రీయముగా బొమ్మను గీసి కత్తిరించునట్టి కాగితపు ఆకారమును బ్లాక్ పాటరన్ అందురు. మొదట కాగితములో కత్తిరించి బ్యాకునుగాని, ఫ్రంటునుగాని బట్టపై సమానముగా అతికి ఆ మాదిరిగా ఔట్ లైన్ (Out Line) మార్కు చేసి ప్యాటరన్ను బట్టపై నుండి తీసివేసి బట్టను కత్తిరించిన మొదల బట్ట అనవసరముగా వ్యర్థముకాక కలసివచ్చును. దీనినే Economical Cutting అందురు.

షోల్డర్ పీసెస్‌నన్ను బ్యాక్‌నందు ఎదరభాగమునందు ఒక పాతి కంగుళము కలిపి కత్తిరించవలెను. Under Arm భుజద్వారము యొక్క క్రింది భాగమునకు 1/2 అం॥ కలుపవలెను.

అడుగు భాగమునకు ఫ్రంటు బ్యాకులకు నడుము కొలతకు 1½ సార్లు అధికముగా కలుపవచ్చును. అనగా నడుము కొలత 20" అయినప్పుడు ఫ్రంట్ పీస్ 30" బ్యాక్ పీస్ 30" (అడుగుభాగమున) గేర్ Ghare స్కర్టు యొక్క అడుగు భాగమున నుండవలెను. చంక దిగువ Arm Hole నుండి, Bodice అడుగుభాగమువరకు క్రింది షేప్ పెంచవలెను. నడుమునద్ద అందముకొరకు గేదర్స్‌గాని, Shell Gathers గాని, స్మోక్స్‌గాని (Smoking), దగ్గరగా లాగు కుచ్చిళ్ళనుగాని ఏవిధముగాగాని తయారుచేయవచ్చును.

## Smoked Tunic

బ్లాక్ పేటరన్ కత్తిరించిన తరువాత బ్యాక్ యొక్క పై భుజము గీతనుండి 1 అం॥ వెలుపలగా మెడద్వారమునుండి, భుజద్వారము వరకు Short Yoke యొక్క ఆకారమును తెల్పుచుము. పూర్తిచేయవలసిన నడుము కొలతకు 3 రెట్లు అధికముగా కుచ్చిళ్ళకొరకు బట్టను తీసికొనవలెను. పైకి కత్తిరించిన షోల్డరు పీస్‌నకు సరిపడునట్లుగా కుచ్చి

శ్యకొరకు అధికముగా పీలిచిన బట్టను గాదన్నుగాని, Smoking గాగాని అమర్చవలెను.

## Slashed Tunic

ఫ్రంట్ భాగమందు భుజద్వారమునకుమధ్యగా చాతీమీదుగా లోపునకు Slash కత్తిరించుదానిని శ్లాష్ అందురు. కత్తిరింపు అందముగాను, సామాన్యముగాను ఉండవలెను. Slashes ఎప్పుడును భుజద్వారమునందుగాని, నడుమునందుగాని యుండవచ్చును. ట్యూనిక్ యొక్క ఎదర భాగమునందును, వెనుక భాగమునందునుకూడా యుండవచ్చును. లేక ఒకప్పుడు ఎదర భాగమునందుమాత్రమే శ్లాష్ నుంచి ట్యూనిక్‌ను పూర్తి చేయవచ్చును.

ఫ్రంట్‌నకు శ్లాష్ ఉంచినపుడు బ్యాక్‌ను ప్లెన్ ట్యూనిక్ బ్యాక్ వలె కత్తిరించవలెను. (వీటిని ముఖచిత్రమునందుచూడగలరు)

## How to Cut the Block Pattern

### పేటర్నును కత్తిరించు విధానము

శాస్త్రీయమైన కొలతల రూపమున దుస్తుయొక్క ఫ్రంటు, బ్యాకు పీసులను ఆకారములో గీయుదానిని బ్లాక్ ప్యాటర్న్ అందురు.

## బట్టలలో గల పన్నాలు: బట్టలయొక్క పేర్లు

### పన్నాలు

సాధారణముగా హిందూదేశమునందు కర్మాగారములలో తయారగునట్టి బట్టలలోగాని పాశ్చాత్యదేశమునందలి యంత్రములపై తయారైన బట్టలలోగాని 27 అం॥ మొదలు 30, 32, 34, 36, 38, 40, 45, 50, 55 (అంగుళముల) వెడల్పులవరకు చూచుచుందుము.

ఇందలి భాగములు షర్టింగు, కోటింగు Under & Upper Wears గా విభజింపబడి ఆయా భాగములకు సంబంధించినవిగా వుండవచ్చును.

## అట్టి బట్టలయొక్క పేర్లు: వాటి వివరములు

### ఎకార్డియన్ ప్లీట్స్ Narrow Straight Pleats

తిన్ననైన సన్నని ప్లీట్లు.

ఎకార్డియను స్టిచ్

అడ్డముగా వేయు ప్లీటును టక్ అందురు. ఒకటి విడిచి మరి యొకటి కట్టుదురు.

కాన్వాస్

ఆడా అందురు.

## A L B

సాగుడు దుస్తును ఆల్బ్ అందురు.

ఐరోప్లేన్ ఫాబ్రిక్

విమానపు రెక్కలకు ఉపయోగింపబడునట్టి సాదా నేతబట్ట.

ఆల్బర్టు క్లాత్

ఉల్టా సీదా లేని బట్ట. రెండువైపుల ఉపయోగింపబడు బట్ట. సూట్లకు, కోట్లకు, జుబ్బాలకు పనికివచ్చును.

ఆల్బర్టు కార్డు

సాదా నేత సిల్కుబట్ట. దీనిని అల్పాకా అందురు.

ఆల్బర్టు క్రేప్

గరుకుగనుండు దారముతో నేయబడిన బట్ట.

ఆ ల్ ఫ్లా ల్

ఏ బట్ట అయినను పదునుగు పేకలలో ఉన్నితో నేయబడునట్టి దానిని ఆల్ ఫ్వూల్ అందురు. ఉదా:- ఫ్లానల్, ఉన్నె, సర్జి మొ.

## All Pain

చాలా తక్కువ ధరగల ఉన్ని బట్టకు పేరు. ఓవరు కోటులకు లైనింగు కొరకు సాధారణముగా రంగువేసిన కన్నా తెమ్మనట్టిదిగా నుండి ఉపయోగింపబడుచున్నది. కోటులకు. పై జమాలకు ఈ బట్టనుపయోగింతురు.

## Alpara

పెరూలియామెరికా యను జంతువు యొక్క వెంట్రుకలు తెప్పులోను ఉన్ని రాప్‌లో బలమైన దారము వేయుదురు. రకరకముల రంగులుగల ఊలులో ఈ బట్ట నేయబడును. సాల్ఫాక్స్ రాజైన బెంజామిన్ ఆట్రాన్స్ అను నతడు మొదట ఈ బట్టను ఇంగ్లాండులో కనిపెట్టెను. తాను స్వయముగా రగ్గులకు, శాలువలకు సంచులు మాదిరిగా నేయబడిన రేప్స్ బరువైనవాటిని తయారుచేసెను. టీటస్ సాల్ట్ అను నతడు ఈ ఉన్నినుండి మృదువైన దారమును వడకుట, దానినుండి బట్టలను నేయుట కనిపెట్టువరకు మొదటి వస్త్రముల నెవరూ వాడువారు కారు. ప్రస్తుత మా బట్టలను మిల్లులలో కూడ నేయుచుండిరి.

### అమెజాన్ క్లాత్

నాణ్యమైన, అందమైన ఊలుబట్ట. వివిధ రకముల నీడతో కూడిన అడుగు భాగము కలిగియుండును.

### అమెరికన్ క్లాత్

చిరికెసీడ్ ఆయిలుతో తడుపబడిన బట్ట. టేబిల్సుకు, చైర్సుకు కవర్లుగా నుపయోగింతురు.

### ఎండార్షియన్స్

స్పైన్ ఊలుతో నేయబడిన బట్ట.

### ఎంగోలా

ఫ్లానల్‌తోను, ఉన్నితోను అమర్చబడిన బట్ట. కత్రి దారముతో నేయబడిన బట్ట.

### ఆర్మోజీన్

ఒకసారి సాదా సిల్కుబట్ట. నల్ల రంగులో నుండును. ఉద్యోగస్థులు ఉపయోగించుదురు.

### ఆర్మ్యూర్

సిల్కు వెనుక నేతతో నేయబడినది. అలంకారముతో కూడిన బట్ట. సన్నితమైన వరుసలతో స్పష్టముగా నేయబడిన బట్ట.

### ఆర్మీ కాక్

యుద్ధభూమియం దుపయోగింపబడెడు బట్ట.

### ఆర్టిఫిషియల్

మానవసృష్టియుతమగు సిల్కు. పురాతనపు పేరు రేయాన్ క్లాత్ అందురు.

## Blacked Cloth

జనుములు పడుగు పేకలలో నేయబడిన ఒక రకపు బట్ట.

## Bad Cover

అవక తవక నేతలతో కూడిన పడుగు పేకలలో దూరముగా నేయబడిన నేతగల బట్ట.

## Baize

వివిధ రంగులతో అద్దబడిన ఉల్లా సీదా కలిగిన ఎరుపు, మట్టి రంగులు కలిసిన రంగులో నేయబడిన ఒక విధమైన బట్ట.

### బాలెన్స్ క్లాత్

పడుగు పేకలయందు సమాన పుంజములో నేయబడి పోగుల యొక్క ఎక్కువ కొనలు కలిగినటువంటి అంచుతో కూడిన బట్ట. బట్టల నుపయోగించుటలో బలమైన బట్టయొక్క స్థానము నలంకరించును.

## Bandana

ఎరుపు, నలుపు భాగవుందునందు రంగుతోకూడి అచ్చటచ్చట వ్యతిరేకమైన రంగు చుక్కలవలె కన్పట్టుచు బట్ట నచ్చటచ్చట తెల్లగా నుండుటకొరకు ముడులు వేసి రంగులో ముంచి పిమ్మట విప్పిన మధ్యమధ్య తెల్లగానుండు కాలికో బట్ట. బుద్ధికుశలతతో కూడిన అద్దకపు పద్ధతి మొదట ఇండియాలోను, ఇండియా ఆర్చిపిలాగో నీలిమందు అద్దకము మొదట ఎక్కడైతే అవలంభింపబడి, యిప్పటికిని ఖర్చుతో కూడబడినప్పటికి వ్యాప్తికొరకు, చిన్న చిన్న మాదిరీలకొరకు, పేరు కొరకు అమిత సంఖ్యలతో కూడిన చేతిరుమాళ్ళ రూపమున వెల్లడి చేయబడుచున్నది.

### బానక్ బరన్ ట్వీడ్

ఇది చీలియట్ బట్టయొక్క ప్రఖ్యాతి గాంచిన మరియొక పేరు. పడుగు పేకలలో వివిధరకములైన రంగుతో ఒకటి విడిచి ఒకటి రంగు పోగులతో నేయబడిన బట్ట. ఇది మొదట బకింగ్ హామ్ మిల్లులో తయారగుచుండెడిది. ప్రస్తుతము ట్వీడ్ నేయబడు ప్రతి మిల్లులోను తయారగుచున్నది.

### బ రా క న్

మధ్యధరా సముద్రపు ఒడ్డున నుండెడి ఒంటెల వెంట్రుకలతో దళసరిగాను, బలముగాను, బరువుగా నేయబడి మోల్ స్కిన్ క్లాత్ వలె మోటుగానుండు బట్ట. దీనిని మధ్యధరా సముద్ర ప్రాంతములో ప్రజ లుపయోగింపబడు దుస్తులకు పనికివచ్చును.

### బరాతియా: వీవింగ్- నేత. **Weft**-పడుగు: **Warp**- పేక

నేతలో బహు సున్నితముగా చారలవలె పగులగొట్టబడిన నేతతో కూడిన **Black and Blue** రంగులలో నేయబడిన బట్ట. మొదట ఇది బ్రాడ్ ఫోర్డు ఒక యిన్ నేత పరిశ్రమగల జిల్లాలలో తయారగు

చుండెడిది. తరువాత రానురాను ఘనముగా రకరకముల యువకులచే ధరింపబడెడి దుస్తులకు వాడబడుచున్నది. ప్రస్తుతము అందమైన నూలుటింగు బట్టగా పరిగణింపబడు చున్నది. ఇది కాకీరంగులో నున్నప్పుడు యుద్ధభూమియందు ధరించెడి కోట్లకు యిదే నేతలో సిల్కు దారములతో నేయబడినప్పుడు డ్రెస్ కోట్లకు ఉపయోగింపబడుచున్నది.

## బరోనెట్ శాటిన్

నిడాపైన మెరుపు కలిగిన అతలసీ క్లాత్. B. A. గౌనులకు, స్పోర్టింగ్ స్కర్టులకు ఉపయోగించుటలో ప్రఖ్యాతి వెలసినది.

## బాటిస్టు

ఇదియొక సున్నితమైన సిల్కుతోను, ఉలుతోను నేయబడిన బట్ట. తరగతియందు బహు తేలికయైన నేర్పరితనముతో పూర్తిచేయ బడినటువంటి బట్ట యని నిర్ణయింపబడినది. కాని ఇది యొకప్పుడు బరువైన నేతతోను, విశాలమైన పడుగుతోను, నైన్‌సూక్ అను బట్టయొక్క వెడల్పుకంటె ఎక్కువైనదిగాను నేయబడుచుండెడిది. లినెన్ అను మెటీరియల్‌తో తయారుచేసెడివారు. కాని ప్రస్తుతము ఎక్కువగా నూలు పదార్థమునందే తయారగుచున్నది. లినెన్ బాటిస్ట్ అనునవి మొదట నేత పరిశ్రమయందు ఆదర్శప్రాయుడైన ఫ్రెంచి బాటిస్టువలన కనుగొనబడి కంబారీ కాంబ్రే అను దేశములో యితని యొక్క విగ్రహము నెలకొల్పబడినది.

## బ్లీచ్ క్లాత్

సమానమైన నేతలో నేయబడి పడుగు పేకలయందు వ్యత్యాసమైన పుంజములో నేయబడిన బట్ట.

## బీవర్

ఇది ఒక సున్నితమైన ఉలుబట్టగా నుండి ముగింపులో బ్రాడ్ క్లాత్‌ను పోలియుండును. ఇది మొదట ఇంగ్లాండులో తయారుచేయబడి

బీవర్ అను జంతువుయొక్క ఉన్నితో తయారగుటవలన ఈ పేరు వచ్చినది. టోపీలు, మిలీనరీవర్కుయొక్క మృదుత్వముకొరకు టోపీల యొక్క లోపలిభాగమందు ఉపయోగింపబడుచుండెడిది. వివిధ తరగతులలో వివిధ వస్తువులయందు ముగింపులో ఆయా వస్తువులయొక్క అలంకారము ననుసరించి ప్రత్యేకవిభజనతో పేటెంటు బీవరని పిలువబడుచుండెడిది.

## బెడ్ ఫోర్డు కార్డు

పడుగు పేకలలో మెలివేయబడిన దారములతో పైగా నేయబడిన బట్ట.

## బ్లీ డిం గ్

బట్టకుగాని, దారమునకుగాని పెట్టబడిన మరియొక పేరు. ఈ పేరు బట్టయొక్క పుంజము ననుసరించియు, పడుగు దారములయొక్క రంగును, రంగులయొక్క నీడను వేయుటలోని అవలంభనపై ఆధారపడియుండు బట్ట.

## బ్లీ చ్డ్ కా లి కో

రంగు తీసివేయుట లేక వేరుచేయబడుట. బ్లీచింగ్ పద్ధతులలో అణచిపెట్టబడిన సామాన్యపు నూలు నేతబట్ట. Gray బూడిదరంగులో నున్నటువంటి కాలికో బట్టను పోలియుండి చూపులకుమాత్రము మరియొక విధముగా కన్పట్టుచుండును.

## బా డ్ కి న్

ఇది మరియొక పరికరము. సూది మొనతో కూడి బట్టయందు కన్నములను వేయుటలో ఉపయోగింపబడుచుండును. ఇది లావైనట్టియు, పొడవైనట్టియు సూదివలెనుండి చివరభాగమునందు కన్నువలెనుండి వస్తువులయొక్క హెమ్మునందు అవసరమైనచోట్ల రంధ్రములకొరకై ఉపయోగింపబడెడి పరికరము.

## బాటిస్టేల్

పట్టును పేకలయందు మిశ్రమము చేయబడిన గొఱ్ఱెఊలువలన తయారుచేయబడెడి బట్ట.

## కాంబ్రిక్

బహు దట్టముగా ఉన్న పత్తిని పేకలతో నింపబడిన మిల్లులో తయారుచేయబడిన మస్లిన్ క్లాత్ వలె నుండెడి బట్ట. ఇది నిజముగా బహునైన మస్లిన్ బట్టయే అయియుండి ఓవరుకోట్లకుపయోగింపబడుచుండును. బహు దగ్గర పుంజములో నేయబడి బహు దళసరిగాను, మడతపెట్టుటకు వీలుకానటువంటిదిగా నుండుటవలన ఎక్కువ విలువైనవియై అమితమైన మంచు కురిసెడి దేశములయందు ఆయా కాలములలో ఉపయోగింపబడెడి దుస్తులను తయారుచేయబడునట్టి బట్టగా పరిగణింపబడుచున్నది. ఎక్కువ విలువైన కోట్లను ధరించు రాజకుటుంబములవారిచే ధరింపబడి, తదుపరి ఇంగ్లీషువారు, రైల్వేపనివారు, కూలీలవలన ఉపయోగింపబడును. దీనికి మరియొక పేరు కేంబ్రిక్ అను పట్టణమునందు వెలువడినది. గాన దీని కా పేరు వచ్చినది.

## బ్రిలియంటైన్

ఆల్పాకా బట్టవలె తీగలతో కూడినటువంటిదిగానుండి కుటుంబ గౌరవమును కాపాడుటకై ధరించెడి దుస్తుగా వాడబడుచుండును. అంగోరా మేకయొక్క వెంట్రుకలతో తయారుచేయబడిన బట్టయగుట వలన ఆల్పాకా స్థానముననే అలంకరించుచున్నది.

## బ్రాడ్ క్లాత్

ఇది బహు సున్నితమైన ఊలు బట్ట. సామాన్యమైన నేతలో ఉన్నితో నేయబడి అనంతరము అనుకూలమైన రంగులలో ముంచబడి దానిపై రకరకముల చారలను గడులుగా అద్దబడి డ్రెస్సులుగా తయారుచేయబడుచున్నది. ఇది నీళ్ళలో వేసినప్పుడు దగ్గరగా లాగు

కోటు లోపలి భాగమున మొదట చేయుటలో వెడల్పయిన పనుగునందు ముడుపబడుచుండును. ఇది ఫ్రాక్ కోట్లను, డ్రెస్ కోట్లను, మార్నింగ్ కోట్లకు ఉపయోగింతురు. ఈ బ్రాడ్ క్లాత్ అను పేరు సన్నబట్టలయందును, తక్కువ వెడల్పుగల బట్టయందును, తక్కువ ఖరీదుగల బట్టలయందును చేరుచున్నది.

### బ్రష్డ్ ఫాబ్రిక్స్

పై భాగమునందు బ్రష్ ఆకారము కలిగిన ముగింపుతోకూడిన బట్టను బ్రష్డ్ ఫాబ్రిక్ అందురు.

### బక్రమ్

ఒక విధమైన పైనముచేతగాని, జిగురుచేతగాని గట్టిపరచబడి లినెన్‌లో తయారుచేయబడునట్టి బట్ట. దుస్తులను తయారుచేయుటలో దళసరి గట్టితనముకొరకు రెండు పొరల మధ్య ఉపయోగింపబడెడి ఒక విధమైన వెంట్రుకలతో కూడిన బట్ట. దీనిని టోపీల ఆకారములో Hats నూ, పుస్తకములను బైండింగ్ చేయుటలోనూ ఉపయోగింతురు. ఇది ప్రత్యేకముగా దర్జీలవలన ఊలుకోట్లయొక్క కాలర్లను, మిలిటరీ యూనిఫారములను తయారుచేయుటలో దర్జీలవలన అధికముగా ఉపయోగించబడుచుండును. నేత పరిశ్రమలో ఒక రాజిల్లాలోను యూరప్, ఏషియా ఖండమునందును ధనికులవలన ధరింపబడి జానునం దాక విధమైన ప్రఖ్యాతి, పేరు గలిగిన బట్ట.

### బక్ స్కిన్

దళసరైన, బరువైన మిల్లునందు ఉన్నితో తయారుచేయబడి సాధారణముగా తెలుపులోను, సామాన్యమైన నేత, రంగులోను ఉన్నటువంటి బట్ట. దీనియొక్క అధికమైన మెరపుతో కూడిన రబ్బరుదారములతో నేయుబడిన దగుటవలన ప్రత్యేకముగా బక్‌స్కిన్ అని పేరు పెట్టబడినది. దీనిని నేతయందు ముగించుటలో ఎక్కువ మన్నిక కలిగి

నట్టిదిగాను, జలమైనట్టిదిగాను నుండునట్టి దీనియొక్క స్థితి ఖర్జైన దారములపైనను, దగ్గరగా అమర్చబడిన చిక్కనైన పడుగుపైనను ఆధారపడియున్నది. ఇట్టి ఆధారమే దీని ప్రఖ్యాతికి కారణమైయున్నది.

## కేంబ్రిక్

ఇదియొక సున్నితమైన మస్లిన్ బట్టవలె నేయబడిన నూలు బట్ట. కంబ్రే అను పట్టణములో మొదట దీనిని కనుగొనబడి ఈజిప్టు దారముతో నేయబడి పడుగు పేకలయందు సమానమైన నేతతోను, మృదుత్వములోను, గట్టితనములోను ఒకదానితో పోలియుండుటగాని, పోటీచేయుటగాని అంగు దుస్తులకును, జేబురుమాళ్ళకును, కర్టెనులు కొరకును, తలగడా గలేబులు, బెడ్ షీట్లకొరకు ఉపయోగింపబడు చున్నది.

## షిఫాన్

ఇది గట్టినేతతో ముగింపుగలదియు, గాజువన్నెతో కూడిన పైభాగము కలదియు నగు మృదువైన ఉన్ని బట్ట. మిక్కిలి బరువు గలిగి, అధికమైన మన్నికగల బట్ట. ముఖమల్, టెప్టా, వెల్వెటు బట్ట లను పోలి బహు సున్నితముగా నుండును.

## చించిల్లా

బహు మృదువైన నేతతో కూడిన ఉన్నిబట్ట. ఇది బహుచలి దేశములయందు ధరించు ఓవరు కోట్లకు, చలికోట్లకు, రగ్గులకు ఉప యోగింపబడుచున్నది. స్పైన్ దేశములోగల చించిల్లా అను పట్టణము యొక్క పేరును వహించుచున్నది.

## గింగ్ హామ్

గడితోగాని, చారలతోగాని నేయబడిన నూలుబట్ట. ఇది దుస్తులకు గృహామునందుపయోగించు దుస్తుల కుపయోగింతురు.

దీనికి పేరు మలయాదేశమునందొక గ్రామములో తయారగుటవలన దీని కా పేరు వచ్చినది.

### ఆర్గండీ

మెరపుతో కూడిన నేతగల నూలుబట్ట. సామాన్య రంగులో నేత తెలుపు రంగులో నేయబడెడిది. కొన్ని సమయములందు చారలతోను, గళ్ళతోను 28" మొదలు 60" వెడల్పుగలదై యుండి బరువైన, విలువైన దుస్తులయొక్క అడుగు భాగమునందు లైనింగులుగ ఉపయోగింపబడుచున్నది. దీనికి గాజువంటి మెరపుగల పై భాగము గలది. దీనిని మొదట తెలుపు చేసి (బ్లీచ్) అందమైన డిజైనులలో అద్దుటకొరకై ఉపయోగించుచుండిరి. మజ్లిన్‌బట్టకంటె కొంచెము మోటుగా నుండును. దీనిని తేలికయైన దుస్తులకు ఎక్కువగా ఉపయోగించుచురు.

### ట్విల్

మొదట ఇది సర్జి, డెనీమ్, కాంటన్, ఫ్లానల్ మొదలుగాగల పట్టణములలో విరివిగా తయారై సాంకేతిక పదముగా వాడబడుచున్నది. ఎడమనుండి కుడికి కర్ణాకారములో పరుగిడుచున్నటువంటి నిష్పత్తిదారముతో నేయబడిన మృదువైన బట్ట.

### జీన్ : U. S. A. యునైటెడ్ స్టేట్ of అమెరికా

నేయుటకు వీలైన నారలకు స్థానమైన అమెరికా స్టేట్సునుండి పెట్టబడిన పేరు. గోధుమలను బహుసున్నితముగా తయారుచేసెడి అమెరికా యునైటెడ్ స్టేట్సు కార్పరేషనుతో పోలికలేని నారలతో రబ్బరువంటి గుణము కలిగినట్టియు, బలమైనట్టియు సంతృప్తికరమగు పద్ధతిలో తయారైన బట్ట.

### జిఫర్ Zepher

ఇది సున్నితముగ తేలికయైనట్టి రంగు వేయబడిన దారములతో అనేక మాదిరీలలో అనేక రకములుగా నేయబడిన నూలుబట్ట. ఒక్కొ

క్కువ్వుడు సమానమైన నేత గలిగి అడ్డకములోకూడ ఉపయోగింప బడుచున్నది.

# POCKETS-జేబులు: అవి పనిచేయు విధానము

## 1 Bound Pocket పంట్లాము బెల్టులో వేయునట్టి జేబు

వెయిస్టు బాండు కుట్టు కొంతవరకు రైటుసైడునగాని, టాప్ సైడులో వెయిస్టుబాండు సీమును 3" గాని, 3 1/2 గాని అవసరమైనంతవరకు ఓపెన్ చేసి సంచి జేబు నమర్చుదానిని బౌండ్ పోకెట్ అందురు.

## 2 Patch Pocket

ఫ్రాకులకు, షర్టులకు, బ్లౌజులకు, రాంపర్సులకు వేయు సాదా జేబును సింపిల్ పోకెట్ అందురు. దాని కొలతలు పొ + వె 4 1/2 + 5 లేక 5 + 6" వరకు ఉండును. పొడవు వెడల్పులకు 1/2" వ్యత్యాసముండును.

## 3 Cut Pocket

దుస్తుయొక్క పై భాగమును అవసరమైనచోట బ్రెస్టులోగాని, వెయిస్టులోగాని చాతీలో 6 వ వంతునకు అధికముగా నుండకుండునట్లు కత్తిరించి జేబు పైకి కనుపించకుండగా పనిచేయుదానిని కట్ పోకెట్ అందురు.

## 4 Fob Pocket

అనగా పై చెప్పిన మాదిరిగా కట్ పోకెట్ వలె పనిచేసిFlap అనగా కవరు లేకుండగా పనిచేయుదానిని ఫాబ్ పోకెట్ అందురు. అర్ధచంద్రాకారములోగాని, అడ్డముగాగాని యుండవచ్చును.

## 5 Flap Pocket

పై చెప్పిన Fob Pocket ను కవరుతో పూర్తిచేయుదానిని ఫ్లాప్ పోకెట్ అందురు.

## 6 Welt Pocket

దీనిని సాధారణముగా వెయిస్టు కోటులలోను, ఓపెన్ కోట్లు లోను, లాంగ్ కోట్లులోను, షేర్వాణీలలోను, బస్టునందును, వెయిస్టు నందును సాధారణముగా చూచుచుందుము. దీనిని పనిచేయు విధము పై చెప్పిన వస్తువులలో కావలసిన స్థానములయందు అవసరమైనంత వెడల్పున దుస్తుయొక్క పై భాగమునే కత్తిరించి Cut Pocket పని చేయుటలో కత్తిరించబడిన అడుగు అంచునకు Comming cut Band మాదిరిగా ముక్కను పెంచి, దానికి సంచి నమర్చి జేబు కనపడనుండగా పూర్తిచేయుదానిని వెల్టు పోకెటందురు.

## 7 Box Pleat Pocket

ఇది తరుచుగా పనకు మిలిటరీ దుస్తులయందు కనబడుచుండును. మామూలు జేబుయొక్క వెడల్పుకంటె 2" అధికముగా తీసికొని మధ్యగా మడచి 1 అం॥ వెడల్పున కుట్టి మధ్యకు విరిచి గోళ్ళతో సాపు చేసి పూర్తిచేయవలెను. అది పై కంచుదానిని Up Word అనియందురు.

## 8 Box Pleat

కొంతవరకు మధ్యగా ఓపెన్ చేసి అడుగునకు త్రిప్పుదానిని Inverted half opened Box Pleat అనియు అందురు.

## 9 Pleated Pocket

పై చెప్పినట్లుగా ప్లీటును అవసరమైనంత బట్టను అధికముగా తీసికొని జేబునకు మధ్యగాగాని ఒక ప్రక్కగాగాని అధికముగా తీసికొనిన బట్టను ప్లీట్సుగా ఉపయోగించి పూర్తిచేయుదానిని ప్లీటెడ్ పోకెట్ అందురు.

## 10 Bag Pocket

దీనిని లాల్చీలయందు తరుచుగా వాడుచుందురు. దీనిని జేబు అందురు. బాగ్(సంచి)కవసరమైనంత బట్టను దాని లోతునను సరించి Defth of Bag సంచి జేబుమాదిరిగా కుట్టవలెను.

## 12 Pin Tucks Pocket

జేబు కిరు పక్కల సన్నని టక్కులు 4 గాని, 6 గాని వేసి కుట్టు దానిని పిన్ టక్ పోకె టందురు. ఈ పిన్ను టక్కులనే ఏటవాలుగా మూలలందు అందమైన ఆకృతిలో వేయుదానిని Cross Pin Tuck Pocket అందురు.

## 13 Hip Pocket

దీనిని ప్రత్యేకము పంట్లాములకు వెనుకప్రక్కనే వేయుచుం దురు. దీనిని యుద్ధభూమియందు నుపయోగింపబడెడు ఆయుధములను దాచుటకై ఉపయోగింతురు.

## 14 Cross Pocket

పంట్లామురొక్క సైడున జేబురొక్క ముఖమును నిలువుగా పూర్తిచేయుటకు బదులుగా ఏటవాలుగా పనిచేయుదానిని క్రాస్ పోకె టందురు. దీనినే నిలువుగా పనిచేసిన Side Pocket అందురు.

# COLLARS కాలర్లు

పీటర్ పాన్ కాలరు, టెన్నిస్ కాలరు, క్లోజు కాలరు, స్టాండ్ కాలరు, ప్లెయింగు ఒన్ పీస్ కాలరు, ఫ్లోటింగు కాలరు, ఒన్ పీస్ అటాచ్డ్ కాలరు, గ్లాడ్ నెక్ కాలరు, బేబీ కాలరు, నెహ్రూ కాలరు, సింగిల్ బ్రెస్టు కాలరు, డబుల్ బ్రెస్టు కాలరు.

# EDGES అంచులు

1 రోల్డ్ ఎడ్జి

ఎత్తయిన అంచు. (20 వ పేజీలో చదివిరి.)

2 క్రోషెడ్జి

నాడెలతో కూడిన అంచు.

3 షెల్లెడ్జి

చిప్పగా వుండిన అంచులుగల బట్ట.

4 రాఎడ్జి

కత్తిరించిన పిమ్మట లేచియున్న దారపు మొలకలతో కూడిన అంచు.

## How to Estimate the value of a Genuine Garment:

ఒక సరియైన దుస్తు విలువను అంచనా వేయు విధానము

ఒక దుస్తుయొక్క సరియైన విలువను తెలిసికొనవలయు ననిన ముఖ్యముగా మొదట మనము గమనింపవలసిన పద్ధతులు కొన్ని గలవు. అవి యేవన దుస్తులలో గల రకము లెన్ని? మనము అంచనా వేయవలసిన దుస్తు ఏ శాఖకు చెందియున్నది?

(2) ఆ దుస్తు ఏ మాదిరి బట్టలో తయారుకాబడినది? అసలు పట్టుబట్టయా? నఖిలీ బట్టా? ఆర్టు సిల్కా? నూలా? ఉన్నిబట్టయా?

(3) దుస్తులకు సంబంధించిన బట్టలలో వివిధ రకముల పన్నాలను ఎన్ని అంగుళములనుండి ఎన్ని అంగుళములవరకు గలవు? మనము లెక్కకట్టవలసిన దుస్తు ఏ పన్నాకు చెందియున్నది?

(4) మన దుస్తునకు ఆ పన్నా బట్ట ఎంత పట్టును?

(5) ఆ బట్టయొక్క గజము విలువ ఎంత యుండును?

(6) దానికి కావలసిన లైనింగు, స్టిచింగ్ పైకింగు, బత్తాసులు వగయిరా ఎంత?

(7) మేకింగు చార్జీ ఎంత? లేక దానిని తయారుచేసిన పనివాని మజూరీ (Demand) ఎంత?

మామూలుగా పై చెప్పిన విషయములను తెలిసికొనుటకు (Section 3 Dress Making) వస్త్రుల అమరికయొక్క ప్రథమ భాగమునందు గల స్త్రీ పురుష బాల బాలికలకు వలయు ప్రత్యేక కొలతల పట్టీని గమనించియు — ఈ క్రింద చెప్పబడిన దుస్తుల వివరములు బట్టను నిర్దేశించు పద్ధతుల ననుసరించియు, ఆ బట్ట ఏ జాతికి చెందినది పరీక్షించియు తయారైన స్థానముయొక్క వ్యయ ప్రయాసలను గుర్తించి విధానములను శ్రద్ధతో సూచింపబడిన కారణములను బట్టియు అంచనా వేయుట బహు సులభము.

# ESTIMATION అంచనా

## దుస్తులు — 4 రకములు

### 1 సివిల్ దుస్తులు

అనగా అనవరతము ఈ భౌతిక శరీరమును సూర్యరశ్మి, వర్షం, మరియు చలినుండి కాపాడుటకొరకు, చంటిబిడ్డల దగ్గరనుండి వృద్ధుల వరకు ధరింపబడుచున్న వివిధ రకపు దుస్తు లన్నియు సివిల్ దుస్తు లనబడును.

### 2 మిలిటరీ దుస్తులు

యుద్ధభూమియందును, పోలీసు ఉద్యోగులవలనను, పోస్టులు అండ్ రైల్వే ఉద్యోగస్తులవలనను ధరింపబడు యూనిఫారము అనగా ఒకే రంగులోని కోటు, పంట్లాములను మిలిటరీ దుస్తు లందురు.

### 3 Naval Bases నావల్ దుస్తులు

అనగా సముద్రముపై ఓడలమీద పనిచేయువారివలననూ, తత్సంబంధమైన ఉద్యోగపు దుస్తులు.

## 4 Air Force

విమానము నడుపునట్టివారికొలనను, గాలిలో యుద్ధముచేయు వారికొలనను ధరింపబడునవి.

అసలు పట్టు బట్టయా? నకిలీ లేక ఆర్టు సిల్కా అను విషయము లను గమనించుటకు మొదట ఆ బట్టను తూచిగాని, తడిపిగాని, సాగ తీసిగాని, కాల్చిగాని పరీక్షించవలయును.

అసలు పట్టు బట్ట తూచినప్పుడు ఆర్టు, నకిలీ, సిల్కులకంటె బరువుగానుండి తడిపినప్పుడు అంత ఎక్కువగా తగ్గక, లేక లాగుకొని పోక సాగతీసినప్పుడు సాగువడక, కాల్చినప్పుడు తదితర బట్టలవలె బూడిద గాక, చిట్లము గట్టును.

ఏ దుస్తుల కెంత పట్టునదియు అంచనా వేయు విధానము పై విషయములనుబట్టి తెలిసికొనవచ్చును.

## FITTING ఫిట్టింగ్

అనగా దుస్తుయొక్క అన్యభాగములను శాస్త్రీయముగా తీసి కొనిన కొలతల ననుసరించి మొదట కాగితములో డ్రాఫ్టు చేసి తరు వాత బట్టలో కత్తిరించి అమర్చుదానిని ఫిట్టింగ్ అందురు.

### ఫిట్టింగ్‌లో గుర్తించునట్టి సూచనలు

శాస్త్రీయమైన కొలతలను తీయు పద్ధతి ఆయా కొలతలను క్రమపద్ధతిలో తీయుట, కొలతలను డ్రాఫ్టు చేయుటలో శాస్త్రీయ ముగా ఉపయోగించుట, మొదట కాగితములో కత్తిరించుట, బట్టను వ్యర్థము కాకుండగా పేపరు పేటరన్ ఉపయోగించుట, ఉపయోగించి కత్తిరించబడిన భాగములను సరియైన ఆకృతిలో దుస్తును ముగించుట మొదలగునవి ఫిట్టింగులో అనుసరించునట్టి గుర్తించు సూచనలు.

## రింకిల్స్:- ముడతలు:- ఫిట్టింగ్‌లో తప్పు

### భుజద్వారముయొక్క బ్యాక్‌న రింకిల్స్‌గల బాడీస్

రింకిల్స్ అనగా దుస్తును ధరించునపుడు వెనుక భాగమునందు అందవికారముగా కనబడు ముడతలను రింకిల్స్ అందురు. ఇవి సాధారణముగా అశాస్త్రీయమైన కత్తిరింపులోగల పొరపాట్లను అనుసరించి యుండును. అనగా దుస్తుయొక్క ఎదర భాగపు భుజద్వారమునకంటె వెనుకభాగపు భుజద్వారము అధికముగా కత్తిరించి శాస్త్రమునకు విరుద్ధముగా దుస్తుయొక్క స్లీవును అతుకుటవలన తరుచుగా కలుగుచుండును. రింకిల్స్‌యొక్క బాడీస్‌నుండి చేతులను వేరుచేసి సైడు సీమును విప్పి ఎదర భాగముయొక్క ఆరమ్ హోల్‌నకు సమానముగా నుండునట్లు వెనుక భాగమును క్రమపద్ధతిని కత్తిరించి తిరిగి మామూలుగా చేతి నతికినయెడల రింకిల్స్ అదృశ్యమగును.

### క్రీజ్: మడత

### షోల్డర్ సీమ్‌వద్ద బల్జింగ్

ఉబ్బినట్లుగాని, ముడుతలు పడినట్లు (రింకిల్స్) గాని కనుపించు దానిని బల్జింగ్ అందురు. అవి సాధారణముగా షోల్డర్ పీసెస్‌యొక్క కట్టుభాగముయొక్క అవసరమైనంత పొడవుకంటె దుస్తుయొక్క షోల్డర్ సీమ్‌యొక్క పొడవు అధికముగా కత్తిరించుదానిని Neck ఆకారమునుండి Arm Hole వరకు గల పొడవుకంటె అధికముగా కత్తిరించుటవలన కలుగుచుండును. అధికముగా నున్న ముక్కను Arm Hole లో కత్తిరించి సరిగా నమర్చిన బాగుండును.

## Dipping చొట్టలు కుట్టుట

### చొట్టలు పడుటకు కారణము

షోల్డర్ పీసెస్‌నకు దుస్తుయొక్క వెనుక భాగమును యిజా చేయుటలో (షేప్‌యొక్క అతిక్రమణవలన) ననుసరించి కుట్టకపోవుట

వలనను కలుగుచుండును. దీనిని సరిచేయవలె ననిన షోల్డరు పీసెస్ నుండి దుస్తుయొక్క వెనుక భాగమును ఓపెన్ చేసి మధ్యకు మడచి షోల్డరు పీసెస్‌యొక్క అడుగు భాగపు షేప్ ననుసరించి వెనుక పై భాగమును కత్తిరించి జాగరూకత ననుసరించి కుట్టినయెడల అట్టి డిప్పింగ్స్ రావు.

## MILLINERY WORK మిలినరీ పని

అన్ని దేశములయందును శిరో రక్షణ అనాది సిద్ధాంతమై యున్నది. రానురాను అది గౌరవపదముగాను, ఉద్యోగుల చిహ్నము గాను మారి, నిత్యవస్త్రధారణమునం దొక భాగముగా పరిగణింప బడుచున్నది టోపీ. అట్టి టోపీలలో అనేక రకములు గలవు. పని వాండ్రు ధరించునట్టివి ఒక రకము. డ్రైవర్లు, పోలీసులు, యుద్ధ భటులు, పాశ్చాత్యులు, తదితర దేశీయులు ధరించు సాంప్రదాయకపు చిహ్నమును నిర్దేశించునట్టి టోపీలను తయారుచేయు పనినే మిలినరీ యందురు.

ఇది యిండ్లయందుగాని, విద్యాలయములందుగాని చేయబడని పనియై యున్నది. ఈ పని కవసరమగు (Meterial) పదార్థము లేక (వస్తుజాలము గడ్డి, కోడి, కొంగ నెమలీకలు, దూది, అట్టముక్కలు, కాన్వాస్ బట్ట, లాంక్లాత్, కాకి డ్రిల్ లేక Oil Cloth or Water Proof Cloth యీ పనికి నీటిలో ముంచినను తడవనిదై వుండవలెను.

## UPHOLSTERY అప్ హోల్ స్టరీ

అన నేమియో తెలిసికొనవలె ననిన యెప్పుడైననూ రడీమేడ్ దుస్తుల షాపునకు పోయిన విశదము కాగలదు. అనగా కంటికింపయిన పనితనముతో పూర్తికాబడి ఉపయోగమునకు సిద్ధముగా నుంచబడిన కుర్చీలపై, వ్రాసికొను బల్లలపై ఓవల్ షేపులో నుండెడు చిన్న టీపాయిలపై అలంకారముకొరకు కప్పబడునట్టిగాని లేక ఆయా పరికరములయొక్క మెరపు కాపాడుకొరకుగాని డిజైనులతో కూడిన

ఎంబ్రాయిడరీ పనులతో నిండియున్న బట్టలను; తివాసీలను, కిటికీలకు, ద్వారములకు వెలుతురును రక్షించి యితరుల దృష్టినుండి గదిలోనున్నట్టి వస్తువులను కాపాడుటకొరకై కట్టుచుండు (Screens) తెరలయొక్క సమూహము పై పేటనం దిమిడియుండును. కార్పెట్టులను తయారుచేయుట, కాళ్ళు తుడుచుకొను గోదినీల నల్లుట మొదలుగాగల పను లన్నిటిని అప్‌హోల్‌స్టీ్రపను లందురు.

## Drawn Thread Work పోగుతీత

సాధారణముగా యీ పోగుతీత పని మప్లర్లపైనను, జేబురుమాళ్ళయొక్క అంచులకు 4 లేక 3 అంగుళముల దూరములో చేయుదురు. అనగా ఏదో ఒకవైపు దారములను తీసివేయుటగాని లేక పడుగులోగాని, పేకలోగాని దారములను తీసి కాళీస్థలమును తయారుచేయుటగాని జరుగును. పడుగు, పేక దారములను తీసి కాళీస్థలము నేర్పరచినపుడు ఆ కాళీస్థలమునందు ఎంబ్రాయిడరీ దారములతో అల్లిక పని చేయుదురు. ఈ పోగుతీతలలో ఎంబ్రాయిడరీ 3 రకములుగా చేయవచ్చును.



Dia. No. 25.

1 నాజూకైన దారములతో పోగు తీసిన స్థానమునందు లేసు పని చేయుట.

2 ముతక గుడ్డలపై రంగుదారములతో అందమైన నూదనము చేయుట.

3 నార్వీజియన్ లేక హార్డేంజర్ ఎంబ్రాయిడరీ పని చేయుట.

ఇట్టి పోగు తీత పని యీనాడు కనిపెట్టినదికాదు. క్రీస్తుశక ప్రారంభము నాటికే యిది లమలులోనుండెడిది. ఐరోపాఖండములోని కాన్వెంటులలో దుస్తులను అందముగా తయారుచేయుటకు యీ పోగు

తీత పని చేసెడివారు. మన దేశములో 16 వ శతాబ్దమునుండికూడా యీ పోగుతీత పనిని సాధారణముగా తెల్లని వస్తువులపై చేయుచున్నారు. తెల్లని వస్తువులకు వేరు రంగుగాని, అద్దకముగాని అవసరము లేకుండగా పోగుతీత పని చాల అందము నిచ్చును.

పరుపు గలేబులపైని, తలగడా గలేబులపైని, టేబిలు గుడ్డలపైని, జేబురుమాళ్ళపైని యీ పోగుతీతపని చేయుదురు. కాని యీ పనిని నేర్చుకొనుటకు ప్రారంభించినవారు సాధారణమైన గుడ్డలపైని సాదాఅంచులను యీ పోగుతీతపని చేయుట కలవాటుపడవలయును మొదట—

సన్నని అంచులు కలిగినటువంటి జేబురుమాళ్ళయొక్క పోగులను తీయుటలో తమ తెలివిని వినియోగించి లేసుపనిని దానిపై వేసి తమ కా పని బాగుగా వచ్చిన పిమ్మట పరుపు గుడ్డలు మొదలైన పెద్దవానిపై యీ పోగుతీత పనిని చేసి అలవరుచుకొనవలయును.

## Fabrics for Drawn Thread Work

ఎప్పుడైనను పోగుతీతకు మంచిరకపు బట్టనే ఉపయోగించవలయును. పడుగు, పేకలయందుగల దారములు ఒకే నెంబరుగలవై యుండవలయును. పోగుతీతలోని దారములయొక్క రంగు దానిలో అల్లికకు ఉపయోగించవలసిన దారపురంగు ఒకటిగా నుండవలయును. కొన్ని గుడ్డలలోని పోగుతీత దారములే ఎంబ్రాయిడరీ పనికి పనికి వచ్చును. ఎంబ్రాయిడరీ ఫ్రేమ్, సూది మొనలు కలిగిన కత్తెర యీ ఎంబ్రాయిడరీ పనికి ముఖ్యముగా నుండవలసిన పరికరములు.

### పోగుతీత విధానము

పోగులు తీయవలసిన వస్తువుయొక్క చివరను సూది మొనతో దారపు కొసను మీదికి తీయవలయును. అప్పుడు ఆ పైకి లేవనెత్తిన దారపు కొసను పట్టుకొని మొత్తము దారపు పోగును మెల్లగా బయ

టికి లాగి తీయవలయును. అట్టి దారములను తీసిన స్థానపు అంచునకు చేర్చి బట్టయొక్క అంచును (Hem) హెమ్ చేయవలయు ననిన ఎంత వెడల్పున దారములను తీయవలయునో బట్టపై పెనిసిలుతో మార్కు చేయవలయును.

మార్కు పెట్టిన స్థలమునుండి పోగుతీత చేసిన వెంటనే పై వద లిన బట్టను మడచి పోగుతీత బోర్డరునకు హెమ్ చేయవలయును. ఒక ప్పుడు పోగుతీత మూలలయందు జరుగవలసివచ్చినపుడు పెనిసిలుతో ఆ మూల యేర్పడు రెండంచులనుండి మార్కు చేయవలయును. అడ్డు — నిలువు పెనిసిలు మార్కులు కలియుచోట దారములను పైకి సూది మొనతో లేవనెత్తి వాడియైన కత్తెరతో కత్తిరించివేయ వలయును.

## Hem Stitch

సూదనమునకు, పోగుతీతకు చాల దగ్గర బాంధవ్యము కలదు. అందుచేతనే దీనిని హెమ్ స్టిచ్ అందురు. ఈ కుట్టు పోగులు తీసిన అంచునకు మడతను అతుకుటయే హెమ్ కుట్టు.

ఈ హెమ్ము రెండు విధములుగా చేయవచ్చును.

1. పోగుతీత జరిగిన బోర్డరు పై భాగమున యీ హెమ్మున అదిమిపట్టి దారమును మొదటి పోగుల సమూహమునకు కలిపి కుట్టుట.

2. సమాన సంఖ్యలుగా కొన్ని కొన్ని దారములను ఒక్కొ క్క గ్రూపుగా నేర్పాటు చేయవలయును. ఆ హెమ్మును కుట్టు దార మును మొదట మూడు (Groops) గుత్తళములను ఒకవైపునకు లాగ వలయును.

దారమును యెడమనుండి కుడికి త్రిప్పినయెడల ఆ మూడు గుత్తళములు కలిపి ముడి వేయబడును. అప్పు డా దారమును మరల హెమ్మునకు కలిపి కుట్టవలయును. ఇట్లు చేయుటలో దారమును బిగించి

లాగవలయును. ఈ విధముగా మిగిలిన గుత్తికములను హేమ్ను కలిపి విప్పిగు కుట్టుతో పూర్తిచేయుము.

రెండవ విధానము

పై విధానమునందువలెనే అంచును టాకా చేయునపుడు కుట్టు నిలువుగా పడియున్నది. గాన యీ విధానమునం దన్ని విషయము లలోను పై విధానమునే పోలియుండును గాని కుట్టుమాత్రము కొంచెము యేటవాలుగా నుండును.

ఒకప్పుడు సన్నని పోగుతీత కావలసివచ్చినపుడు Hem Stitch ఒక వరుసలో వేయుట చాలును.

---

# SECTION 1. A

# EMBROIDERY

## ఎంబ్రాయిడరీ లేక బుటేదారీ పని

---

## EMBROIDERY FRAME

### బుటేదారీ అచ్చులు

బుటేదారీ పనివాండ్రు తరుచుగా బట్ట ముడుతలు పడకుండగా కాపాడుకొనవలసియుండును. కుట్లు సున్నితముగాను, సమానముగాను వచ్చునట్లును, బట్ట ముడుతలు పడి కూడుకొనిపోకుండగను చూచుటకు మిక్కిలి నేర్పరితనము కావలయును. ఇది అభ్యాసముచే

రాగలదు. ఎక్కువ అనుభవము గల పనివాండ్రుకూడ యీ బొమ్మ యందు కనబరచిన బుటేదారీ అచ్చును Embroidery Frame ఉపయోగించి తీరవలయును.

ఈ అచ్చులు అనేక రకములు. ఇందు చిన్నచిన్న బుటేదారీ పనులకు టాంబూరు అచ్చులను సామాన్యముగా ఉపయోగింతురు. ఈ టాంబూరు అచ్చులు ఒకదానిలో నొకటి సులభముగాను, బిగువుగాను యిమిడెడి 2 చక్రములను కలిగియుండును. మొదట బట్టను చిన్న చక్రముపై పరచి పెద్ద వలయమును దానిపై నుంచి క్రిందికి నొక్కి పటములో చూపిన మాదిరిగ బిగించవలయును. సూదిని ముందువెనుకలకు పోనిచ్చుచు యీ వలయముమధ్య కావలసినరీతిగా అల్లికకుట్టును పూర్తిచేసి యీ టాంబూరును గుడ్డయొక్క మరియొక భాగమునకు మార్చుకొనవలయును. ఇట్లు మార్చుటలో పూర్తియైన అల్లిక భాగము యీ కర్రవలయముల మధ్య పడి నలిగిపోవచ్చును. అట్టిచో యీ భాగముపై పలుచని బట్టనుగాని, క్రొవ్వుకాగితమునుగాని కప్పవలయును. ఈ టాంబూరు అచ్చులలోనే కొన్ని స్ప్రింగులు, కొన్ని స్క్రూలు, కొన్ని సాధారణముగా కలిగియుండును.



Embroidery (Tambour) Frame

పనివాడు అనుభవము పొందినమీదట చతురాకారపు అచ్చులను ఉపయోగించవచ్చును. ఇవి టాంబూరు అచ్చులంత సులభము కాకపోయినను, తరచుగా అచ్చు నొకచోటనుండి మరియొకచోటికి మార్చవలసిన అవసరములేకుండగ కాలము, కాంత వరకు కలసివచ్చును.

# FABRICS & DESIGNS

## వస్త్ర నిర్దేశము & నమూనాలు: లేక లతలు

బుటేదారీ పనులకు నమూనాకు తగిన బట్టను యెంచుకొనుట చాల ముఖ్యము. సామాన్య కుట్టుపనిలో అప్పటికి అమలులోనున్న నమూనాలే ముఖ్యము. కాని బుటేదారీపనిలో ప్రాతిపదికమైన బట్టను యెంచుకొనుటలో బుద్ధిచాతుర్యము నుపయోగించవలయును. నీవు యెంచుకొను బట్ట తయారుకాబడు బుటేదారీ పనికి తగినట్లుగాను, చేయబోవు నగిషీ కుట్టునకు అందము నిచ్చునదిగాను ఉండవలయును.

అల్లికసూది పనిచేయుటకు నీవు యెంచుకొను బట్ట సులభముగా ఉతకబడునట్టియు,అందలిపోగులను సులభముగాతీయబడునట్టిదియుఅయి యుండవలయును. లేసు కాలర్లు, కోటుయొక్క మెడపట్టీలు Hemmed Openings మడత గలిగిన తెరవు పట్టీలు మొదలగువానికి వదులుగ నేయబడిన క్రేప్ నకిలీపట్టు, గుడ్డలు యెంతమాత్రము ఉపయోగింప బడవు. దట్టమైన సాటీన్లు, లినెన్ బట్టలు బరువైన దారములను భరింపగలిగిన దట్టమైన బట్టలకు చేర్చి అల్లుట మంచిది. సున్నితమైన అల్లిక పనులను ముతక బట్టలపై చేయ ప్రయత్నించరాదు.

పూర్వము సున్నితమైన అల్లిక పనులకు ప్రత్యేకముగా ఉపయోగించెడి కోరాపట్టు మొదలగు రకములు ప్రస్తుతము దొరకుట లేదు. కాని యీ క్రొత్త బుటేదారీ పనులకు తగిన నూలు, నార, ఉన్ని బట్టలు పెక్కు రకములతో బజారు నిండియున్నది. పక్కారంగులలో పనివానికి కావలసిన చాయలలో అనేక రకముల బట్టలు ప్రస్తుతము దొరుకుచున్నవి.

బుటేదారీ నమూనాలకు ముఖ్యమైన కీలకము పనివాడు ఎంచుకొనే బట్టలో నున్నది. మంచి బలమై, దళమైన బట్టలు పరదాలకు, కుషనులకు, దుప్పట్లకు దూరదూరముగా అల్లబడు యేపనికైనను

పనికివచ్చును. సున్నితమైన బట్టలు దగ్గర అల్లిక కుట్లుగల మేజాగుడ్డ లకు పనికివచ్చును. ప్రస్తుతము బుటేదారీ అల్లిక నమూనాలుగల గ్రంథము లనేకములు దొరుకుచున్నవి. ఆ నమూనాలకు తగినటువంటి బట్టను యెంచుకొని దానిపై (Transfer) అనుకరించుటలో పనివాడు తన నేర్పరితనము నెంతయైనను చూపవచ్చును.

ప్రతి బుటేదారీ పనికత్తెయు తాను స్వంతముగా నమూనా లను తయారుచేయవచ్చును. ఇందు బుద్ధివిశేషములకు యెక్కువ ఆవ శ్యకము కలదు. ప్రకృతినుండియు నిత్యజీవితములో మనము చూచు దృశ్యములనుండియు అనేకమైన నమూనాలను కల్పించవచ్చును. అంతియేగాక కుట్టులోను, పట్టీలలోను, అంచులోను పనివాడు తన చాకచక్యము నెంతయూ చూపవచ్చును. బజారులో నమ్మెడి యొక నమూనాను నొక బట్టపై అనుకరించుటకంటె యెంత సామాన్యమైన దైనను తాను స్వంతముగ ఒక నమూనాను జయప్రదముగా తయారు చేయుటలో పనివానికి యెక్కువ ఆనందమును, గర్వమును కలుగును.

## Transfering Designs to Fabric

### బట్టపై నమూనా అనుకరణముయొక్క విధానము

బుటేదారీ నమూనా రంగులతో కూడిన క్రొవ్వు పదార్థము గల కాగితముపై ముద్రింపబడియుండును. దీనిని బట్టపైనుంచి ఇస్త్రీ చేయవలయును. ఈ పని మిక్కిలి సులభముగా నుండినట్లు కనబడినను సరియగు నమూనాను బట్టపై తెచ్చుటలో అనేక విషయములు గమ నింపవలసియున్నవి. నమూనాలు నీలి, పసుపు రంగులలో దొరకును. నీలిరంగు నమూనాలు లేతరంగు బట్టలపైనను, పసుపురంగు నమూ నాలు ముదరరంగు బట్టలపైనను ఉపయోగించవలయును. బట్టను సీదావైపున బల్లపైనుండి అడుగున మెత్తని దిండును ఉంచవలయును. నమూనాను క్రొవ్వుభాగము బట్టపై పడునట్లు పరచి సరియైన స్థితిలో

నుంచి నమూనాను పలకముగా పిన్నులతో బిగించవలయును. పిమ్మట వెచ్చని యిస్త్రీ పెట్టెను తీసికొని కాగితమును, గుడ్డను పెట్టెతో నొక్కుచూ మధ్యమధ్య పెట్టె నెత్తి యిటునటు కదల్చవలయును. నమూనా కాగితముపై యిస్త్రీ పెట్టెనుమాత్రము రాపాడించరాదు.

నమూనా పూర్తిగా యిస్త్రీ చేయబడిన పిమ్మట నమూనా సరిగా బట్టపై పడినదో, లేదో కాగితమును జాగ్రత్తగా నెత్తి పరీక్షింపవలయును. నమూనా సరిగా పడనియెడల తిరిగి పిన్నుల నుంచి మరికొంత వేడిమిగల యిస్త్రీ పెట్టెతో నొక్కుము.

బట్టపై నమూనాలను అద్దు విధములు పెక్కు గలవు. ఈ దిగువ నుదహరింపబడిన సులభమైన పద్ధతులు తృప్తికరముగా నుండగలవు. ఈ పద్ధతులలో దేనినైనను అసలు నమూనాను వివరముగా తయారు చేసి ఒక చదునైన బల్లపై పిన్నులతో నొక్కి ఉంచి, దానిపై ఒక ఉల్లిపొర కాగితము నుంచి పెనిసిలుతో నమూనాను ఉల్లిపొర కాగితముపై గుర్తించవలయును. వివరములను వదలకుండ సరిగా అసలు నమూనాతో సరిపోల్చి చూడవలయును.

బుటేదారీ చేయవలసిన బట్ట లేతవర్ణము కలిగినదైన యీ క్రింది విధానము నుపయోగించవలయును. బట్టను ముడుతలు లేకుండ ఒక బల్లపై పరచి పైన తయారుచేసిన ఉల్లిపొర కాగితపు నమూనాను బట్టను అంటియుండునట్లు పిన్నులతో బిగించవలయును. ఈ ఉల్లిపొర కాగితమును అడుగు భాగమున ఒక పాత కార్బను కాగితమును తలక్రిందుజేసి జొనపవలెను. క్రొత్త కార్బను కాగితము నెన్నడూ ఉపయోగించకూడదు. ఇప్పుడు అల్లిక సూదితో నొక్కి నమూనా లోని ప్రతి గీతను నొక్కుచూ వ్రాయుము. చేతులనుమాత్రము ఉల్లిపొర కాగితముపై ఆనకూడదు. పిమ్మట ఉల్లిపొర కాగితమును, కార్బను కాగితమును తీసివేసి నమూనా సరిగా పడని భాగము లున్నచో ఒక నల్లని పెనిసిలుతో సరిచేయుము.

రెండవ పద్ధతిని నొక్కుడు పద్ధతి యందురు. ఉల్లిపొర కాగితముపై నమూనా తయారయిన పిమ్మట దానిని ఒక మెత్తనిదిండుపై నుంచి ఒక సన్నని సూదితో నమూనాలోనున్న గీతలవెంబడిని దగ్గర దగ్గరగా చిన్నచిన్న రంధ్రములను చేయుము. పిమ్మట గుడ్డపై యీ ఉల్లిపొర కాగితము నుంచి ఒక బల్లపై దీనిని పిన్నులతో నమర్చుము. పిమ్మట నొక చిన్న ఫ్లానల్ దిండును తీసికొని సుద్దపొడుములో ముంచి నమూనాపై చేయబడిన రంధ్రముల వెంబడి యీ దిండుతో తట్టుము. పిమ్మట కాగితమును తీసివైచి చిన్న బ్రష్‌తో తెల్లని జిగురు రంగుతో గుడ్డపై నేర్పడిన సుద్దచుక్కలను జాగ్రతగా కలుపుము. లేక సుద్దకు బదులుగా బొగ్గుపొడుము నుపయోగించి చుక్కలను కలుపుటకు నీలి రంగు నుపయోగించుము.

---

## Transparent Material

### పారదర్శిక పదార్థములపై నమూనాలను బదిలీ చేయుట

ఈ పని మిక్కిలి సులభము. ఒక ఉల్లిపొరకాగితముపై నమూనాను గీసి ఉల్టాను పైకి పెట్టి (Rong Side Up) ఒక బల్లపై నమర్చి పారదర్శిక పదార్థమునుకూడ అదే రీతిని నమూనాపై నుంచవలయును. పిన్నులతో వాటిని బల్లకు బిగించి ఒక బ్రష్‌ను నీలిరంగు నీటిలో ముంచి నమూనాను జాగ్రతగా గుర్తించవలయును.

సామాన్య బుటేదారీ పనులకు పైన చెప్పిన పద్ధతులు అనుకూలముగ నుండగలవు. కాని అల్లిక బుటేదారీ పనులకుమాత్రము ప్రత్యేక పద్ధతులు గలవు. వానిని గూర్చి వేరొక భాగమునందు చెప్పబడినవి.

## Applique అప్లీక్

కుట్టుపనికి సొంపునుగూర్చునటువంటి కళయే అప్లీక్ కళ. బుటేదారీ పనికంటె తక్కువ కాలములో పెద్ద పెద్ద రంగులతో కూడిన

సమూనాలను తయారుచేయు విధము లిందు కలవు. ఈ పని అనే కాకారములతో గుడ్డను కత్తిరించి యీ ముక్కలను వేరొక బట్టపై నేర్పుతో కుట్టబడును. యీ అప్లీక్ కళ క్రొత్తగా కనిపెట్టబడినది కాదు. పూర్వపు గ్రీక్, ఈజిప్టు దేశస్థులు వారి దుస్తులకు సొంపు గూర్చుకొనుటకై యీ కళ నుపయోగించెడివారు. పూర్వము యీ అప్లీక్ కళ యెక్కువ పేరొందినది. జాతీయ పతాకములు, మత సంబంధమైన దుస్తులు యీ అప్లీక్ పనితోనే యెక్కువ అందముగా చేసెడివారు. ఇటలీ, స్పెయిన్ దేశములలో వన్నె వన్నెల సిల్కులు, సాటీనులు, జరీతోకూడిన లేసులు ఈ కళయొక్క ప్రాముఖ్యతను దెలుపుచున్నవి.

ప్రస్తుతము యీ కళను బజారు సంచులు, కుషనులు, తెరలు, మేజాగుడ్డలు మొదలగువాటిని అతి అందముగా తయారుచేయుటకు ఉపయోగించుచున్నారు. వల రూపమున వదులుగా నేయబడిన చౌకరకపు బట్టలు మొదలు ఖరీదైన సిల్కుబట్టలువరకుకూడ యీ అప్లీక్ పనిని ఉపయోగించవచ్చును. వేరు వేరు దళసరి బట్టలు యీ కళకు ముఖ్యావశ్యకములు.

నూలు బట్టలు, ఉన్నిబట్టలు, సిల్కుబట్టలు మొదలగున వన్నియూ యిందు ఉపయోగింపబడును.

అప్లీక్ పనికి పుష్పములు, ఆకులు, కొమ్మలు, జంతువులు, యితర బొమ్మలు వివరములు తక్కువగా నుండిన యెక్కువగా ఉపకరించును. యీ కళను బుటేదారీ పనితో మిశ్రముచేసిన చేయవచ్చును. అప్లీక్ పనిలో వివరములు తక్కువగా నున్న (Plain Designs) బొమ్మల నమూనాలు ముఖ్యముగా కావలయును.

ఒక బొమ్మను అప్లీక్ విధముగా ఒక బట్టపై మనకు యిష్టమైన నమూనాను వేయవలసివచ్చినచో ఒక ఉల్లిపొర కాగితముపై ఆ బొమ్మలోని ముఖ్యమైన భాగములను విడివిడిగా గీయవలయును. పిమ్మట ప్రతి భాగమునకు సరిపడు వర్ణములో (Colour) రకరకముల

గుడ్డలను కత్తిరించవలయును. ఆ కత్తిరించిన ముక్కలలో కొన్ని రకములుగా మడచుటవలన బొమ్మలోని వేర్వేరు అంశములను గుర్తించవచ్చును. యిట్టి అప్లీక్ పని తలుపు తెరలకు, కిటికీ తెరలకు మిక్కిలి ఉపయుక్తము. ఈకళను మొట్టమొదట ప్రారంభించువారు ముందుగా రంగు రంగుల కాగితములతో ప్రయత్నించిన యెక్కువ నేర్పరితనమును పొందగలరు.

అప్లీక్ విధానమున పెద్ద పెద్ద నమూనాలను తయారుచేయునపుడు ఒక (Frame) అచ్చును ఉపయోగించిన బట్ట ముడుతలుపడక బల్లపరుపుగా నుండును. చేతితో తయారుచేయబడిన నమూనాలను ముడుతలు పడనీయకూడదు. ఒకసారి ముడుతలు పడిన నమూనాను తిరిగి సరిచేయుట కష్టము. తయారైన నమూనాపై ఒక కవరు కాగితమును పిన్నులతో నమర్చి నమూనాను చుట్టి దాచుకొనుట మంచిది.

నమూనాను గుడ్డపై నుంచి వెనుక చెప్పిన యిస్త్రీ చేయవలయును. పిమ్మట నమూనాలోనున్న ఆకృతులను వేర్వేరు రంగులలో కత్తిరించవలయును. యీ కత్తిరించిన ముక్కలను మాదిరిగా తీసికొని వేర్వేరు రంగుగుడ్డ లనేకము కత్తిరించవలయును. గుడ్డ సులభముగా దారములు విడిపోవునదైన (Sewing Down Method) క్రింది కుట్టు విధానము నుపయోగింపవలయును. ఈ పద్ధతిని ముందు ముందు వివరముగా వర్ణింపబడును. గుడ్డయొక్క పడుగు పేకలు (Warp & Dept) దానిపై నతుకు నమూనాయొక్క పడుగు పేకల ననుసరించి యుండవలయును. అనగా రెండింటియొక్క పడుగు పేకలు ఒకే దిక్కులో నుండునట్లు చూడవలయును. నమూనా వివిధరీతులుగ నున్న యెడల ముడుచుకొనిపోవును.

కత్తిరించిన నమూనాలను దానికి తగిన రంగు చిక్కదనముగల అనుగు గుడ్డపై నతుకవలెను. నమూనాలను ఒకదానిపై మరియొకటి ఉంచవలసివచ్చినపుడు అడుగు నమూనాను కుట్టవలెను. తరువాత

మొత్తని సబ్బు పేస్టు నమూనాకు మధ్యభాగమున పూసిన దానిని కదల కుండగా నుంచగలదు. ఇట్టి జిగురు పదార్థము నుపయోగించునపుడు అది యెక్కువ చెమ్మగా నుండరాదు. అట్లు చెమ్మగానుండిన నమూనా అంచులు బయవెక్కి కుట్టుట కష్టమగును.

ఇట్లు చేసిన పిమ్మట నమూనాను పిన్నులతో నమర్చి అంచుల వెంబడి చిన్న చిన్న టాకీ కుట్లు వేయవలయును. అప్లీక్‌ను బుటేదారీ కుట్లతో కలుపవలసివచ్చినప్పుడు టాకీకుట్లుకంటె వరుస కుట్లే ఉపయుక్తము. ముడుతలు పడిన గుడ్డ నుపయోగించినప్పుడు నమూనాను తగిన రంగు దారములతో విప్పింగ్ కుట్టు కుట్టవచ్చును. చేతితో తాకిన ముడుతలు పడే బట్ట నుపయోగించినప్పుడు నమూనాను అంచు వెంబడి కత్తిరించినపుడే కొంచెము ఎడముగా కత్తిరించుట మంచిది.

## Button Hole Stitch, Blancket Stitch, Loop Stitch

ఈ రకపు కుట్లు అప్లీక్ పని చేయునప్పుడు యింకనూ అనేకములైన బుటేదారీ కుట్లు నుపయోగించవచ్చును. ఈ పుస్తకము యొక్క మొదటి భాగమైన (Practical Needle Work) నందు అట్టి కుట్లు కొన్ని వర్ణింపబడియున్నవి.

## Turc Point టర్క్ పాయింట్

ముడుతలు పడని గుడ్డతో అప్లీక్ పనిచేయునప్పుడు మూడు దిక్కుల కుట్టు నుపయోగించుట (Three-Side Stitch) టర్క్ పాయింట్ అందురు.

## Punch Stitch పంచ్ కుట్టు

ఈ కుట్టునకు నెం. 1 లేక 2 లావుసూదిని సిల్కుదారముతోగాని, మామూలునూలు దారముతోగాని ఉపయోగించవలయును. సూదిని నమూనా అంచుపద్దకు తెచ్చి ఒక చిన్న వెనుక కుట్టును వేయుము. పిమ్మట సూదిని యిదివరలో అది పోయిన దిక్కునకు తెచ్చి ఒక అడ్డ

కుట్టును వేసి (B) సూదిని మొదట వచ్చిన దిక్కునకు దగ్గరలో పోనీ యుము. పిమ్మట సూదిని లాగి, నమూనా అంచుయొక్క అడుగు భాగమునకు తెచ్చి యెడమ వైపున వెనుక మాదిరిగా వేయుము.

## Blind Applique బ్లైండ్ అప్లిక్

ఈ విధానములో అలంకృత కుట్లను Decorative Stitches వదలివేయవలయును. యీ బ్లైండప్లిక్ విధానము సన్నని దారములతో నేయబడిన బట్టలపై యెక్కువ అందము నిచ్చును. యిందు నమూనాలను కత్తిరించునపుడు చిన్న చిన్న వంపులను వదలవలయును. ఇదివరలో వలెనే యీ నమూనాలను అంచునకు లోపుగా టాకీలను వేసి గుడ్డపై నమర్చవలయును. పిమ్మట సూది చివరను, వ్రేళ్ళ చివరను ఉపయోగించి ఒక అంగుళమునకు లోపుగా అంచు వెంబడిని గుడ్డను మడువుము. ఇట్లు చేయుచూ అంచును అడుగునకు కానరాని Invisible కుట్లచే కలుపుము. ఈ కుట్లు సాధ్యమైనంత దగ్గరగా నుండవలెను.

## In - Lay - Work ఇన్ లే వర్క్

అనగా యీ విధానములో నమూనాను గుడ్డకు అతుకుటకు బదులుగా, గుడ్డనే నమూనాకు అతుకుట. అనగా గుడ్డ లోపలి భాగమున నమూనాను చేర్చి కుట్టుట. నమూనాను గుడ్డపై పిన్నులలో నమర్చి దారములు పడుగు — పేకలు Warp & Wept ఒకే దిక్కులో నుండునట్లు చూడవలయును. పిమ్మట వరుస కుట్లతోను, టాకీ కుట్లతోను నమూనా గుడ్డకు చేర్చి వాడియైన కత్తెరతో అడుగున్నర గుడ్డను నమూనా వెంబడినే కత్తిరించివేయవలయును. పిమ్మట కత్తిరించిన అంచు చుట్టును కాజా కుట్టు వేసి నమూనాను గుడ్డకు

అతుకవలెను. తరువాత కుట్టు గీతకు దాటియున్న అనగా అధికముగా నున్న బట్టను బహుజాగ్రతగా వాడియైన కత్తెరతో కత్తిరించివేయ వలయును.

# COUNTER CHANGE

## Lingerie Work లింగరీ పని

అప్లీక్ విధానములో యిట్టి లింగరీపని చాల ప్రాముఖ్యమైనది. చిన్న చిన్న సిల్కు ముక్కలను ఉపయోగించి తయారుచేసిన యీ లింగరీ పని యెక్కువ సొంపుగా నుండును. యిందు ఉపయోగించు గుడ్డలు మిక్కిలి సున్నితమైనవి. తరుచుగా సుతకబడెడివి గనుక అంచును అడుగునకు మడచి ముందుగా కుట్టవలెను. సిల్కు, సాటిన్ ముక్కలైనయెడల కాజా కుట్లను, జార్జట్ ముక్కలైనయెడల పంచ్ కుట్లను ఉపయోగించవలయును. మిగిలిన విషయములలో అప్లీక్ విధానములో నుపయోగించిన విషయములనే గమనించవలయును.

## Net Applique

వలగుడ్డపై తయారుచేయబడిన లింగరీ అప్లీక్ మిక్కిలి అందముగా కన్పట్టును.

దుస్తులయొక్క అంచులను కత్తిరించి ఒక వల అంచునకు చేర్చి కుట్టిన యెంతో అందముగా కన్పట్టును. యీ పనికి జములు నేత వల గుడ్డ యెంతో ముఖ్యము. యీ వల యప్లీక్ బుటేదారీ కుట్లతోగాని, ఇక్ లే పద్ధతినిగాని చేసిన గట్టిగాను, సున్నితముగాను ఉండును.

---

# SECTION 2

# PRACTICAL DRESS MAKING

---

## రవికె New Look Choli

ఇది పూర్వాచార పరాయణులగు స్త్రీలు ధరించెడి దుస్తు. శరీరము నంటియుండి మోచేతిపై రెండంగుళముల పైవరకు చేతులు గలిగియుండును. దీనికి మెడ పట్టీగాని, గుండీగాని యుండక, అడుగు భాగమునందు ముడివైచుకొనుటకుమాత్రమే వీలుండును.




Dia. No. 26.

అవసరమైన కొలతలు:

1. చాతీ చుట్టుకొలత 32"
2. పూర్తి పొడవు 14"
3. షోల్డర్ వెడల్పు 13"
4. చేతి పొడవు 8"
5. చేతి అడుగున లూజు 5"

### కత్తిరించు విధానము:

Dia. No. 26 నందు చూపబడిన బొమ్మ రవికయొక్క బ్లాక్ ప్యాటరన్.

### నిర్మాణ క్రమము

A,B,C,D. ల మధ్య వరుపబడినది కత్తిరించిన రవిక ఆకారములోనున్న బట్ట. దాని మధ్యభాగమున నిలువుగీత్పై గల గుర్తు O కేంద్ర స్థానము.

B — o = చాతీ చుట్టుకొలతలో సగమునకు 2" అధికము. (16 + 2 = 18")

B - C = రవిక పూర్తిపొడవు 14" + 1" O నుండి M వరకు చదరపు గీత. అనగా రవిక బాడీస్‌యొక్క సమపాలు.

O - 5 = 1"    O - 2 = $2\frac{1}{2}$

5 - 7 = షోల్డర్ కొలతలో సగము. 7 - 6 = చాతీ కొలతలో 4 వ వంతునకు 2" తక్కువ (8" — 2" = 6"

9–E = 1 1/2 అం॥  9–8 = O–B కొలతలో సగము.

3 నుండి C వరకు రవిక బాడీస్ సగము మడత (రెండు పొరల్పై) బొమ్మలో చూపిన మాదిరి లఘువలయములో కత్తిరించి పూర్తిచేయుము.

### రవికయొక్క 2 రకముల చేతులను కత్తిరించు విధానము

కత్తిరించుటకు పూర్వము బొమ్మలో O, 3, N, & 4, 6 గుర్తుల మధ్య చూపబడిన, భుజద్వారమును వలయాకారములో కత్తిరించునపుడు సరిపడునట్టి రవిక చేయి.

3, 4, & 6, N గుర్తుల మధ్య చూపబడినది, బ్లాక్ పాటరన్ [illegible]బగలు చేయి.

3- N = చేతి పొడవు 6". 3- 4= చేతి వెడల్పు 6"

చేతి ముందు పట్టీ- 2 గు స్తు 2" N - 6= చేతి ముందుగల వమలు.

---

# BODICE బాడీ

## నవనాగరిక స్త్రీలు ధరించు లోదుస్తు

స్కేల్ 1" = 5"

దీనిని శాస్త్రీయముగా కత్తిరించుటకై తీసికొనవలసినవి రెండు కొలతలు మాత్రమే. (1) పొడవు 11". (2) చాతీ చుట్టు కొలత 32"




Dia. No. 27.

పై చెప్పిన కొలతల ననుసరించి బ్లాక్ ప్యాటరన్ గీయు విధానము:

O కేంద్రస్థానము.

O-S= పూర్తి పొడవునకు ఒక అంగుళం అదనము.

8-O= చాతీలో నాల్గవ వంతునకు 1'' తక్కువ.

9-8= చాతీలో నాల్గవ వంతునకు 1 అం॥ అదనము.

9-3 ఏటవాలుగీతకు 3/4'' వెలుపలగానున్న గీత 9 నుండి క్రిందికి చదరముగా గీయబడినది.

6-5= చాతీలో 6 వ వంతు. (32÷6=5 2/3''

5 గుర్తుకు క్రింది వాలుగీత 1/2'' స్లోప్.

5 నుండి క్రింది 9 వరకు బొమ్మలో చూపిన విధముగా బాడీ పై భాగముయొక్క భుజద్వారమును గీయుము.

11-8= 3/8''

6 నుండి 11 వరకు దుస్తును ధరించువారి అంగీకారము ననుసరించి V ఆకారములోగాని, U ఆకారములోగాని గీయుము.

11 నుండి క్రింది S వరకు కలుపుము.

S నుండి గీయబడిన చదరపు గీతకు, క్రిందిగీత 1/2'' 3 నుండి 2 ద్వారా చివరకు సమాన దూరములో నున్న డార్టులతో కూడిన బాడీ అడుగు భాగపు గీతను గీయుము.

బొమ్మలో చూపిన రెండు డార్టులను, ప్రతిదానిని 3/4'' నకు మించనీయకుము.

## వెనుక భాగము

10-O= చాతీ చుట్టుకొలతలో 12 వ వంతునకు 1/2'' అధికము. (3''). 6 నుండి 10 వరకు వలయాకారములోగీయుము. 5 నుండి 9 వరకు భుజాకారమును గీయుము. వెనుక అడుగుభాగమును 3 నుండి S వరకు గీయబడిన గీతపై కత్తిరించి పూర్తిచేయుము.

# జంపర్ — బ్లౌజ్

## స్కేల్ 1"=5"

దీనిని శాస్త్రీయముగా కత్తిరించుటకై అవసరమైనది ఒక చాతీ చుట్టుకొలత 32" మాత్రమే.

పద్ధతి:
○ కేంద్రస్థానము. ○-9=చాతీచుట్టు కొలతలో 4వవంతు నకు 1" తక్కువ. ○- 10 = వెనుక మెడ గుంట నుండి బొడ్డునకు సమానముగ వెనుక నడుము వరకు గల వీపు పొడవు. ○-20= బ్లౌజునుధరించువారి కోర్కె ననుసరించి యుండుపూర్తిపొడవునకు 1" అధికము ○-2 3/4= చాతీ కొలతలో 12వవంతు



Dia. No- 28.

○-A = వెనుపూసనుండి భుజముమీదుగా అవసరమైన చేతి పొడవు. N-M=చాతీలో 4 వ వంతునకు 1 3/4" అదనము. M నుండి క్రిందికి K ద్వారా P వరకు చదరపు గీత. K వద్ద ప్రక్కకుట్టుగీతను చదరపు గీతకు 1/2" నొక్కి బొమ్మలో చూపిన విధముగా కత్తిరించుము. 2 3/4-6,= యెదర కాలరుయొక్క మెడాకారమును కత్తిరించుము.

A నుండి చుక్కల గీతలో చూపినట్లు 5 1/2'' చేతిముందుగల వదులు. బొమ్మలో చూపిన మాదిరిగా కాలరును చేతి ముందు కప్‌ను వేరొక రంగు బట్టతో నలంకరించి పూర్తిచేయుము. ముఖ్యముగా పైపింగు, కాలో పైపింగు విధానములతో పూర్తిచేయవలసిన ముఖ్యాలంకార స్థానములు.

## Magyar Blouse మాగ్యార్ బ్లౌజ్

దీనినే షేకీజ్ జంపర్ అందురు. అన్ని విషయములలోను పై చెప్పిన జంపర్ బ్లౌజ్ నే పోలియుండును. కత్తిరించుటలో భుజముపై



Dia. No. 29.

కుట్టుండకపోవుటవలన పై దుస్తుతో దగ్గర బాంధవ్యము కలిగియుండియు, పొడవునందు వ్యతిరేకించుటవలన దీనికి మాగ్యారని పేరు వచ్చిన దనుకొందము.

ఒకప్పుడు పొట్టిదైనను షోల్డరుపై కట్ కలిగి, భుజద్వారము నుండి అవసరమైనంత పొడవు గలిగి— వేరుచేయబడిన చేతులు గల దిగకూడ నుండవచ్చును. అప్పుడిది New Look Choli క్రొత్త రకపు రవిక రూపములో నుండవచ్చును.

మాగ్యారును కత్తిరించు విధాన మంతయు పై జంపర్ ననుసరించియుండును. కత్తిరింపు విధానము గుర్తులతో చూపబడినదిగా విస్తరించి చెప్పనక్కరలేదు.

అయినను, వీపుపై మధ్యకుట్టును మెడగుంటనుండి క్రిందికి రానురాను వెడల్పుగా డార్టువలె పట్టి సన్నము చేయబడియున్నది.

మెడాకారము గుండ్రముగా నుండి సరియైన మెడ కొలతకు 2'' అధికముగా నుండవచ్చును. చేతిని మోచేతిపై 3'' వరకు పెంచి చేతి ముందు మాత్రము దంపకు పట్టిపుండునట్లు చూడవలయును.




Dia. No. 30.

వెనుక మెడగుంట భుజములపై కుట్టునకు 1/2'' మాత్రమే దిగియుండవలెను. మొత్తము మెడ చుట్టుకొలత 16'' కు మించకూడదు. వక్షస్థలముపై పొడవునా క్రిందివరకు గుండీల నుపయోగించిన తెరవు (Opening) తో కూడియుండునట్లు చూడవలెను. ఈ రకపు దుస్తును మహారాష్ట్ర స్త్రీలు తరుచు ధరించుచుందురు. ప్రస్తుతము పూర్వాచార పరాయణులగు వయసు మళ్ళిన హిందూ స్త్రీలుకూడ ధరించుచున్నారు.

## Blouse with Puff Sleeves బుట్టచేతుల ఫ్యాన్సీ బ్లౌజ్

స్కేల్ 1" = 6"

స్త్రీ దుస్తును బ్లౌజనియు, పురుషదుస్తును జాకెట్టనియు వాడుదురు, అన్యదేశీయులు. Eg:-రఫరు జాకెట్, పెట్రోల్ జాకెట్, మెస్ జాకెట్, ఫీల్డ్ సర్వీస్ జాకెట్—




Dia. No. 31.

ప్రస్తుతము యిది ఆంధ్ర యువతీమణులవలననేగాక, తదితర జాతి స్త్రీలవలనకూడ నవనాగరికత ననుసరించి నూతన విధానములలో కత్తిరింపబడిన చేతులతో ధరింపబడి, బహు సుఖప్రదమైన దుస్తుగా భావింపబడుచున్నది. ప్రస్తుత మిది సర్వమహిళామండలికొక అలంకారమని చెప్పక తప్పదు. ఈ దుస్తును కత్తిరించి తయారు చేయు విధానమును మా పాఠక మహాశయులు జంపర్ రూపములో గుర్తించియుందురు.

## అవసరమైన కొలతలు:

(1) చాతీ చుట్టుకొలత 32'' (2) నడుము చుట్టుకొలత 24 1/2''
(3) భుజముల వెడల్పు 12'' (4) భుజద్వారమునుండిచేతిపొడవు 6½''
(5) మెడగుంటనుండి వీపుమీదుగా క్రిందికి నడుము వరకు 14''
(6) పూర్తి పొడవు 18''

## పై భాగము:

○-K= పూర్తి పొడవునకు 1 అంగుళము అధికము (19'')

8-○= చాతీలో 4 వ వంతునకు 1'' తక్కువ (7'')

○-5= మెడగుంటనుండి క్రిందికి బొడ్డునకు సమానముగ నడుము కొలత (14'') 22- K= 1/2''

○-6=చాతీలో 4 వ వంతునకు 1 1/2'' అధికము (9 1/2'')

6 నుండి 7, 2 ద్వారా 3 వరకు చదరపు గీత.

ప్రక్క కట్టు చుక్కలగీతపై నడుమువద్ద నున్న 4-2=3/4''

7 గుర్తునుండి 4, 13 గుర్తులద్వారా అడుగు భాగమున 3 వరకు బొమ్మలో చూపిన మాదిరి చుక్కల గీత ననుసరించి ప్రక్క కట్టు గీతను షేప్ చేయుము.

○-3= చాతీ కొలతలో 12 వ వంతునకు 1/4'' అధికము. (2 1/2+1/8+1/4)=2 3/4''+1/8''.

○-5=(భుజము) షోల్డరు కొలతలో సగమునకు 1/4'' అధికము (6 1/4''). 5 నుండి క్రింది A వరకు చదరపు గీత.

5-4=1''; 10-A = 3/4''

ఫ్రంట్ పార్టుయొక్క భుజద్వారమును బొమ్మలో చూపిన గట్టిగీతవలె కత్తిరించుము. ఫ్రంట్‌యొక్క మెడ V ఆకారముతో కూడిన ఓపినింగును 3 నుండి 8, 5, 22 గుర్తులద్వారా K వరకు కత్తిరించుము.

12 గుర్తు జేబుయొక్క ముఖ్యస్థానమును వక్షమునందు బ్లౌజు యొక్క అందమైన ఆకారము లేక (Fitting) తెల్పునట్టి డార్టును సూచించును. దీనిని 3/4" వరకు మించనీయరాదు.

## Back Parts వెనుక భాగమును కత్తిరించు విధానము

ఈ వెనుక భాగమును బొమ్మలో చుక్కల గీత రూపమున కనుపరుపబడినది. ◯-1= 1 1/2; 3 నుండి 1 వ గుర్తువరకు గల చుక్కలగీత, వెనుక మెడ ఆకారము. 1 నుండి 8, 5, 22 గుర్తులద్వారా K వరకు గల గట్టి గీత, బ్యాక్ సెంటర్ (Crease Edge)

పై భాగమునందువలె 12 గుర్తువద్ద యిరుప్రక్కల వెనుక భాగమునందుకూడ 3/4" డార్టులను పట్టవలసియుండును.

### చేతిని కత్తిరించు విధానము

బొమ్మను సరిగా గమనించినయెడల కుడిప్రక్క క్రిందిభాగమున చేతిని, పైభాగమునందు కాలరును తెలిసికొనగలరు.

1-2=బాడీలోని ◯-8+2 అనగా చేతిపొడవు 7"+2"=9"
2-6=8-0 (7") 6 నుండి 1 వరకు బొమ్మలోని చుక్కల గీత.

8-1= 1 నుండి 6 వరకు గల కొలతలో 1/4.

9-8=1 3/4"; 7-6=1-6 లో 1/3.

చేతియొక్క వెనుక భుజద్వారపు కుట్టుగీతను బొమ్మలో చూపినట్లు 1 నుండి 9 ద్వారా, 6 వరకు ఉబ్బుగీతవలె ఆకారముచేయుము. చేతిని బాడీయొక్క ఫ్రంటు భుజద్వారమునకు అంటించు కుట్టుగీతను 1 నుండి 9 ద్వారా పై చెప్పిన గీతకు కొంచెము క్రిందుగా 6 వరకు కలుపుము. 3-2=2"; 5-4=1/4" నుండి 1" వరకు ధరించువారి అంగీకారము ననుసరించి ఏటవాలు గీతతో 6 నుండి 4 వరకు గీయుము. 2,4 గుర్తులమధ్య చూపిన చుక్కలగీతవద్ద సన్నని Pin Tucks గాని, గ్యాదరింగ్ రూపమునగాని చేతియందు అవసరమైన లూజ్

ననుసరించి ముగించవలయును. భుజద్వారము ననుసరించి భుజము మీాద నుండు ప్లీటులను చేయుము.

### కాలరు

A నుండి 5 వరకు గల భాగము ఫ్రంట్ బాడీయొక్క V ఆకారము ననుసరించి యుండును. A నుండి 3 వరకు గల భాగము బ్యాక్ పార్టుయొక్క మెడగుంట ననుసరించును. 6-3= 2" అనగా కాలరు వెడల్పు. ఇట్టి కాలరు పీసులను బొమ్మలో చూపిన విధముననేగాక, కంటికింపగు ఆకారములో బుద్ధితోచినవిధముగా కత్తిరించి పూర్తి చేయవచ్చును.

## Second Model Sleeve

మరియొకమాదిరి బుట్టచేతిని కత్తిరించు పద్ధతి



Sleeve Finish

K -7= చాతీలో 4 వ వంతునకు 1 1/2" అధికము. K -8=2-8;8-7= 2 1/2" 8 నుండి 7 ద్వారా క్రింది 6 వరకు గల చదరపు గీతను పై 5 వరకు పొడిగించుము. 5 నుండి 6 వరకు గల కొలతలో 8 మధ్యభాగము ఒకప్పుడు చేతి పొడవు తీసికొనని పక్షమున అది 5 నుండి 6 వరకు గల కొలతయని భావించుము. 5-C= 1/3 K-5; అలాగుననే 5-A= 1/3 5-2;N-C మరియు 9-A= 1"

బొమ్మలో చూపిన గుర్తుల మధ్య కత్తిరింపబడిన చేయిపూర్తిఅయినపిమ్మట N నుండి 5 ద్వారా 9 వరకు చూపబడిన కెరటములగీత పై బాడీయొక్క భుజద్వారము ననుసరించి చేతిని సరిపుచ్చుటకై అలంకారమునిచ్చుగ్యాదరింగ్‌గాని, ప్లీటింగ్‌గాని చేయుము.




Dia. No. 32.

## Peeterpan Collared Frock పీటర్ పేన్ కాలర్డ్ ఫ్రాక్

స్కేల్ 1"=5"

నవీనయుగమునం దిది హిందు భాలికావస్త్రధారలోనిదయినను పాశ్చాత్య దుస్తని చెప్పక తప్పదు. పీటర్ పేన్ అను పేరుగల కాల




Dia. No. 33.

రుతో కూడిన దగుటవలన యిట్టి కాలరుతో కూడిన దుస్తు లనిన హిందూమతాంతరుల కమితమైన ప్రేమ. ప్రస్తుత సూదన పరీక్షా ప్రణాళికయం దతి ముఖ్యఘట్టములోనిది. గాన ఫ్రాకెట్లున్నను కాల రును పలువిధములలో తయారుచేయవలసిన నేర్పు ముఖ్యావసరము.

6 సం॥ వయస్సుగల బిడ్డకు సరిపడునట్టి ఫ్యాన్సీ ఫ్రాక్.

దీని కవసరమగు ముఖ్య కొలతలు:

ఛాతీ చుట్టుకొలత 24" నడుము చుట్టుకొలత 24"
షోల్డరు వెడల్పు 11" న్యాచురల్ బ్యాక్ 10 1/2"
పూర్తి పొడవు 21"

ఫ్రంట్ భాగమున 4-3 మరియు A-C చదరపు గీతలు కలియు చోట కేంద్రస్థానమును ◯ గుర్తుగా భావించుము.

A నుండి కేంద్రస్థానము ◯ = న్యాచురల్ వెయిస్టు 10 1/2" లకు 3/4" అధికము (11 1/4"). 6-◯= ఛాతీలో 4 వ వంతు. 6-9= ఛాతీలో 4 వ వంతునకు 1 1/2" అధికము. 8 వరకు 9 నుండి చదరపు గీత; 7-8= 1/2" 9 నుండి 7 వరకు ప్రక్క కుట్టు గీత. 3-◯= ఛాతీలో 12 వంతునకు 1/4" అధికము. 2-◯= ఛాతీలో 12 వంతునకు 1 1/4" అధికము. 4-◯= షోల్డరు కొలతలో సగము నకు 3/8" అధికము. 4 నుండి B వరకు చదరపు గీత; 5-4= 1".

ఫ్రంట్ బాడీస్‌యొక్క భుజద్వారమును బొమ్మలో చూపిన గట్టి గీతద్వారా కత్తిరించుము.

## వెనుక భాగము

C-◯= 1" 3 నుండి C వరకు వెనుక మెడగుంటను బొమ్మ లో చూపిన చుక్కల గీత ద్వారా కత్తిరించుము.

C-A = బ్యాక్ మధ్యభాగము.

వెనుక భుజద్వారము చుక్కల గీత.

## Skirt స్కర్ట్ అనగా లంగా భాగము

లంగా పొడవు ◯ నుండి అడుగు భాగమువరకు న్యాచురల్ బ్యాక్ 10 1/2'' పోను ఫ్రాక్ పూర్తిపొడవు 21''. 5-◯=నడుము కొలత 24'' లలో 4 వంతునకు 4'' అధికము. 5 నుండి ◯ లైను వరకు చూపిన చుక్కల గీత మధ్యనుండి 3/4'' వరకు దించి వలయా కారములో కలుపుము.

పై చుక్కల గీత పైనను, క్రింది చుక్కల గీత క్రిందను అంబు గుర్తులవద్ద వలయాకారమును కత్తిరించి వేయుము.

### పీటర్ పాన్ కాలర్

N, M, 2 గుర్తులు గల పీస్ 2, 3, C గుర్తులకు అన్వయించు పీటర్ పాన్ కాలర్ కుట్టుకొరకు 1/4 అంగుళము అధికముగా కత్తి రించవలెను.

### చేయి

1-2= చేతి పొడవునకు 2 1/2'' అధికము. 2-5= చాతీలో 4 వంతునకు 1 1/2'' అధికము. 3-4= 1-2 కొలతలో సగము. భుజముమీదను, చేతి ముందును కెరటముల గీతలలో బట్టను గ్యాదర్సుగాని, ప్లీట్సుగాని వేయుము.

---

## Four Types of Puff Sleeves

### నాలుగు రకముల బుట్ట చేతులు

### స్కేల్ 1'' = 4''

ఇదివరలో బొమ్మల రూపమున వ్రాయబడిన జంపర్ బ్లౌజ్, బ్లౌజ్, ఫ్రాక్ మొదలగు నవీన దుస్తులకు యీ Dia.No·34

నందు నిరూపింపబడిన 4 మాదిరీలతో నేదానినైనను కత్తిరించి అమర్చిననాడు యే వస్తువనకైనను 'నూతన శోభ గల దసుటలో నాశ్చర్యము లేదు. దృష్టిని ప్రసారించి 1, 2, 3, 4 అంకెల గుర్తుతోనున్న క్రొత్తమాదిరి బుట్టచేతులను కత్తిరించు విధానమును గమనింపుడు.




Dia. No. 34.

గమనించుటయే కాదు. ఒక్కొక్కదానిని మొదట కాగితములో కత్తిరించి చూడుడు. విశదమైన వెనుక పాతగుడ్డలో అందమైన తాత్కాలికపు కుట్టుతో కుట్టి చూడుడు. పూర్తియైన పిమ్మట పై చెప్పిన నెద్దానినైనను అలంకరించి ధరింపజేయుడు.

కత్తిరించుట యెట్లందువా?

16'' లకు తక్కువకాని చతురాకారములో అనగా [illegible] రుమాలును లేక అట్టి పరిమాణముగల కాగితమును కర్ణాకారముగా

అనగా ఒక మూలనుండి యెదురుగానున్న మరియొక మూలతో కలుపగా ముక్కోణాకార మేర్పడును. ఈ రెండు పొరలను ముక్కోణాకారములో మడత పెట్టగా నాలుగు పొరలుగల ముక్కోణ మేర్పడును. దానిపై బొమ్మలోనున్న యే నెంబరు చేతిసిగాని మొదట పెన్సిలుతో గీసి ఆకార మేర్పడిన తరువాత అవసరమైన తెల్ల భాగమును వుంచి మిగిలినదానిని కత్తిరించివేయుము.

ఉదా:— చాతీ చుట్టుకొలత 32" అయినయెడల సగము 16" ల చతురాకారపు బట్టనుగాని, మొదట కాగితమునుగాని బొమ్మలో చూపిన 1, 2 గుర్తులు గలిగిన ఆకారములో మడత వేయుము. అనంతరము 1 గుర్తుగాగల ఆకారమునకు తెచ్చి తెలుపు భాగమునే బొమ్మలో చూపిన మాదిరి కత్తిరించుము. ఈ బొమ్మయందు 4 చేతులనుమాత్రమే కనబరచుట కవకాశము గలిగినది. ఈ విధముగా బుద్ధికందముగా తోచినట్లు కత్తిరించి చూచిన విశదము కాగలదు.

## Rompers రోంపర్స్

స్కేల్ 1"=4"

ఇది ఆరు మాసముల వయస్సునుండి మూడు సంవత్సరముల బిడ్డవరకు ధరింపజేయునట్టియు, సునాయాసముగ తొడిగి తీయుట కవకాశము గలిగినట్టియు, మరియు అందమైనట్టియు సుఖప్రదమైన దుస్తు. కూడిపనియందు దేమాత్రపు ప్రవేశమున్న గృహిణియైనను తన చంటిబిడ్డకు స్వయముగా నిట్టి దుస్తును తయారుచేసికొనగలదు. బొమ్మను సరిగా గమనించలేని ఒకే వస్త్రమునందు చెడ్డీతో కూడిన జుబ్బాయని తెలిసికొనక మానరు. దీనిని కత్తిరించుట బహు తేలిక. అవసరమైన కొలతలు బహు స్వల్పము.

చాతీ చుట్టుకొలత 20". (Nape) మెడపై వెనుపూసనుండి భుజములమీదుగా చేతి పొడవు 4 1/2". అర్ధషోల్డరు కొలత + చేతి పొడవు 3"= 7 1/2". పూర్తి పొడవు= 18 1/2".

## ఎదర భాగములను కత్తిరించుట:

○–11= పూర్తి పొడవు. 14–11= 2 1/2''. 4–○ చాతీలో 1/4 కు 1'' అధికము. ○ గుర్తునకు యిరుప్రక్కల చదర గీతలు ○ – 5, ○–14 లను పొడిగించుము. ○–5= మెడగుంట మధ్య భాగమునుండి చేతి పొడవు 7 1/2'' 5–7 = చాతీలో 4 వంతు. ○–3 = చాతీలో 12వంతుకు 1/4'' అధికము.

బొమ్మలో చూపినమాదిరి 3 నుండి 2 వరకు గల గట్టి గీతవలె ఎదరమెడ గుంటను గీయుము.

5–6=1''; 3–6 షోల్డరుపై కట్టుగీత. 7–8=1''. 6–8= చేతి ముందు గల లూజు 4 1/2''. 9–4 = చాతీలో నాలుగవ వంతునకు 1 1/2'' అధికము. A – 11 = చాతీ చుట్టుకొలతలోసగం




Dia. No. 35.

8 నుండి 9 ద్వారా A వరకు జుబ్బాయొక్క ప్రక్క కట్టుగీత.

14-16= 11-14; 11-12= 1". 12 నుండి 16 వరకు గల వలయాకారమును A తో కలుపుము. 2-10 = చాతీలో 3 వంతుకు 1/4" అధికము. ○-14 లైనుపై బట్టయొక్క ఫ్రంటు, బ్యాకుల క్రీజ్ యెడ్జిలు.

వెనుక భాగము

1-○= 1". ○ నుండి 3 వరకు బొమ్మలో చూపిన చుక్కల గీత వెనుక మెడగుంట. 13-12= 1". 15-16= 1". 13 నుండి 15 వరకు వలయాకారము; 13 నుండి 15 వరకు కర్వు. A నుండి 15 వరకు కలుపుము. కాలి ముందు (Elastic Tape) రబ్బరు టేపును జొనిపి కుట్టిన నూతన శోభ కలుగును.

# CHILD'S TUNIC బాలుని ట్యూనిక్

## Measures కొలతలు

స్కేల్ 1" = 8"

1. ట్యూనిక్ పూర్తి పొడవు 20"

2. చాతీ చుట్టుకొలత 26" (Chest Measure)

3. నడుము చుట్టుకొలత 24" (Waist Measure)

4. పిరుదల చుట్టుకొలత 26" (Seat Measure)

5. (మెడపూసనుండి వెన్నెముక మీదుగా బొడ్డుకు సమాన దూరములో) సహజమైన వీపు పొడవు 12" (Natural Waist)

6. వీపు వెడల్పులో సగము 5 1/4" (Across Back)

7. చేతి పొడవు వెనుపూసనుండి భుజద్వారపు కుట్టు, మోచేతి మీదుగా మణికట్టుపై 2" వరకు 17" (Full sleeve length up to Wrist) 8. చాతీ వెడల్పులో సగము 6" (Across Chest)

9. ముదర షోల్డరు (Front Shoulder)

10. షోల్డరు చుట్టుకొలత (Round Shoulder)

11. మెడ కొలత 11" (Neck Measure)

12. అడ్డు షోల్డరు 9 1/4" (Across Shoulder)




Dia. No. 36.

పై దుస్తుయొక్క నిర్మాణ క్రమము:

కేంద్రస్థానము ○– 1 3/4= 1 3/4". ○–20= పూర్తి పొడవు 20" + 1/2"= (20 1/2") 12-0= 12" మెడగుంటనుండి క్రిందికి సహజమైన వీపు పొడవు. 6–○ = 6 1/2" బ్యాక్ దిగుడు (Chest Line) 3-0= 3 1/4". 1 1/2–○ = 6–3 కొలతలో సగము. పై గుర్తు లన్నిటినుండియు చదరపు గీతలు. 12 వద్ద 3/4" వెలుపల నొకచుక్క పెట్టి, దానిద్వారా ○ నుండి 20 వరకు బొమ్మలో చూపిన విధముగా బ్యాక్‌మధ్య కట్టి గీతను కలుపుము. ○నుండి 1 3/4 వరకు మెడ కొలతలో 6 వ వంతు. 3–P = వీపువెడల్పులో

సగము 5 1/4'' + 1/4''= 5 3/4''. 1 1/2-3/4=3/4''. D నుండి P ద్వారా 4 3/8 వరకు భుజముపై కుట్టుగీత (Shoulder Seam) 6-7 1/2= 9''.; 7 1/2-Z = 6''. కాలరు పోయింటుకు C నుండి 6-Z అను చాతీలైనువరకు 6 1/2''. M-S = 1 3/4- 4 3/8- 1/4 (Mines). 7 1/2-S = D-4 3/8 + 1/4''. B గుర్తు 6-Z కు సరిగా మధ్యభాగము. B నుండి క్రింది F వరకు చదరపుగీత. Up-to Waist Line. F గుర్తునకు యిరుప్రక్కల 3/4'' దూరమున చుక్కలను పెట్టి వాటిద్వారా B నుండి అడుగు భాగమునకు బొమ్మలో చూపిన విధమున ప్రక్కకుట్టు (of Back & Front) గీతలు. N-M= 1/2'' M నుండి K వరకు మెడ కొలతలో 6 వ వంతు. K-G=M-K+¼'' K నుండి క్రింది Z వరకు కలుపుము. Z నుండి క్రింది నడుము గీత (Waist Line) వరకు చదరపు గీతతో కలిపి 1/2'' వెలుపలగా మార్కుపెట్టి, ఆ మార్కుద్వారా Z నుండి అడుగు భాగమువరకు బొమ్మలో చూపిన విధముగా గీసి, ఆ గీతను 2 1/2'' సమాన దూరములో పొడవునా మరియొక గీతతో కలిపి గుండీ రంధ్రములను (Button Holes) గుర్తించుము.

నడుమునందు 2 1/2'' మించని (Band) పట్టీ యుండవలెను. పై విధమున వెనుక ముందు భాగములు పూర్తిచేయబడినవి.

## ఒకే ముక్కలో చేతిని కత్తిరించు విధానము:

చేతి బొమ్మను సరిగా గమనింపుడు.

10-9= 10''. B గుర్తు 10-9 లైనుకు మధ్యభాగము. 2 1/2 గుర్తు B-9 కు మధ్యభాగము. B నుండి పైకిని, క్రింది 17 వరకునుగల చుక్కలగీత పూర్తి చేతిపొడవునకు 2 1/2'' తక్కువ. (17''-2½''= 14 1/2''). ఆ మినహాయించిన 2 1/2'' లేసు (ఫ్రిల్లింగ్‌తో కూడిన కఫ్సు) వెడల్పు. B నుండి పై భుజము కుట్టు గీతవరకు 2 1/2'' చేతి

పై భాగమును అనగా చేతి భుజాకారమును బొమ్మలో చూపిన విధముగా 0 నుండి ఉబికిన వలయాకారముతో 9 వరకు కలిపి కఫ్ లూజ్ 6 , 2" లకు 2" అధికముగానుంచి ప్రతికుట్టుగీతను ముగింపుము.

కాలరు

కాలరు, కాజాలు బొమ్మలో చూపినట్లే.

N.B:— M-S= 1 ¾ - 4 ¾ —¼"
అనగా M గుర్తునుండి S గుర్తువరకుగల కొలత.



పై చెప్పిన నిర్మాణ క్రమము ఎన్నియో అన్యగ్రంథముల నుండి చేసిన పరిశోధనవలన గలిగిన సులభశైలి. ఇది మిక్కిలి సులభముగా పట్టువడునట్టి శాస్త్రపద్ధతి. దీని నవలంబించెదరేని పూర్వము మీకుగల అశాస్త్రీయమైన పద్ధతిని మరువవలయును. కేవలము దీని యందు నిమగ్నులై యిట్టి అసమాన సూక్ష్మపద్ధతిని ప్రయోగము నందు కేంద్రముగా నుంచుకొనిన ఎట్టి పెద్దరకపు దుస్తునైనను సునాయాసముగా నిర్మించగలరు. బుద్ధి వికసించి మీకుగల స్వల్ప ప్రవేశము నధికము చేయక మానదు. పెద్ద దుస్తులైనను, చిన్నవైనను కత్తిరింపులోగల మూలసూత్ర మొక్కటియే. అట్టి దుస్తులు రూపము నందుమాత్రమే వేరుగాని, నిర్మాణమునందుగల పద్ధతి ఒకటే. దీని ననుసరించకయే నిస్పృహ చెందకుడు.

ఈ (System) శాస్త్రపద్ధతిని ప్రయోగించి ఈ పుస్తకములో చివర భాగమునందున్న కోటును, ట్యూనిక్ నందుగల కాలరు, నడుము పట్టీ, చేతిని తీసివేసిన, బాడీ అనగా (Back — Front) డబుల్ బ్రెస్ట్ కోటుగా మారును.

# Blouse Knicker బ్లౌజ్ నిక్కర్

స్కేల్ 1"=5"

ఇది చంటిబిడ్డలకు సరియైన దుస్తు. సాధారణముగా 3 నుండి 6 సం॥ వయస్సుగల బాలురకు సుఖప్రదమైన వస్త్రధారణతో సిది




Dia. No. 37.

ముఖ్యమైనది. అందముకొరకు, అలంకారముకొరకు రక రకముల చేతులు, కాలరు నిక్కరుతో కూడియుండును. ఇవి రెండును కలిసి యున్నప్పటికి వివిధ రంగులలో నుండుటవలన అందము నిచ్చును. అందుచే యూనిఫారమ్ డ్రెస్ అనబడదు. శాస్త్రీయమైన పద్ధతిలో కత్తిరించుటకు అవసరమైన కొలతలు:—

1. చాతీ చుట్టుకొలత 24". 2. పిరుదల చుట్టుకొలత 26"
చేతి పొడవు 15". సహజమైన వీపు పొడవు 11"
నిక్కరు పొడవు 12". (ఇవి ఆరు సం॥ బాలుని కొలతలు)

బ్యాక్ :

○-3= వీపు పొడవు (Natural Waist) 11" లకు 1/2" అధికము. 2-○= చాతీలో 4 వంతు. 1-○= చాతీలో 1/16;

3-B = 1/2". ○ నుండి 4 ద్వారా B ని కలుపుము. 1-5 = చాతీలో 6 వంతునకు 1 1/2" అధికము. 5 నుండి S వరకు చదరపు గీత 6-○ = చాతీలో 12 వంతునకు 1/4" అధికము. 6-7=3/4"; E - 5= 1/2". 9-2= చాతీలో 4 వ తునకు 1 1/4" అధికము. 9 నుండి C వరకు చదరపు గీత. A నుండి B వరకు చదరపు గీత. A - 10= చాతీలో 3 వంతునకు 1" అధికము.

## Front యెదర భాగము

9-A = చాతీలో నాల్గవ వంతునకు 1/4" అధికము, 10-A = చాతీలో 4 వంతునకు 1" తక్కువ. (Across Chest). A - 12 = 10, A లో సగమునకు 3/4" అధికము. 10-12= A, A సగమునకు 3/4 తక్కువ. K. 12= చాతీలో 4 వంతు. K నుండి F వరకు బొమ్మలో చూపినట్లు కలుపుము. F,K= 7, E; 10 ని F తో కలుపుము. K.L= చాతీలో 12 వంతు. L-M= చాతీలో 12 వంతుకు 1/4" అధికము. L ను M ద్వారా A తో చూపినట్లు కలుపుము. M - N = 3/4".; N నుండి L, A లకు సమాన దూరములో D వరకు కలుపుము. బ్యాక్ లో E నుండి 9 ద్వారా F వరకు భుజద్వారము ను చూపినట్లు ఓవల్ షేప్ కలుపుము; యిది E నుండి F వరకు చాతీలో సరిగా సగము.

(Most of the diagrams given in this Section
are drafted to the reduced scales)

No more important Educational Task
saves & confronts us to-day.
To-day's readers may be to-morrow's Dress Makers.
Every boy & girl should realize the true meaning of

## నిక్కర్స్ Knicker




8-○ = నిక్కరు పూర్తి పొడవు. 9-○ = పిరుదల చుట్టుకొలతలో 3 వంతునకు 1/2'' అధికము. 4-9 = పిరుదల కొలతలో 4 వ వంతునకు 3/4'' అధికము. 4 నుండి పై 1 వరకు చదరపు గీత. 9-3= పిరుదల చుట్టుకొలతలో 3 వంతునకు 3/4'' అధికము. 4-6= సీటులో............6వంతు. 6 నుండి 3 వరకు బొమ్మయొక్క నిరూపణ. 7-1 = 1''. 7ను3తో కలుపుము. 7-2=1½'',

Dia. No. 38.

## చేయి Sleeve



2-○= చేతి పొడవు + 1''.
1-○= చాతీలో 12 వంతు.
4-1= చాతీలో 4 వంతునకు 3/4 అధికము. 3-2= చాతీలో 6 వంతు.

Dia. No. 39.

# Tennis Shirt టెన్నిస్ షర్ట్

స్కేల్ 1"=7"

దుస్తు నిర్మాణమునం దిదియొక ఫాషనబుల్ (డ్రెస్) అంగీ. వారు వీరనక ప్రతివారిచేతను ధరింపబడుచున్నది ప్రస్తుతకాలములో.




Dia. No. 40

దీనిని శాస్త్రీయముగ కత్తిరించి పూర్తిచేయవలయు ననిన యీ క్రింద నీయఁబడిన కొలతలు ముఖ్యావసరము.

పూర్తి పొడవు 32". చాతీ చుట్టుకొలత 36". షోల్డరు కొలత 16". చేతి పొడవు 23". మెడ కొలత 13 1/2".

## పై భాగము

○-F = షర్టు పూర్తి పొడవు 32" + 1". ○ నుండి క్రింది F వరకు కొంతవరకు గట్టిగీతగాను, మిగిలినది చుక్కలగీతవలెను గీయబడిన లైనుపై బట్టయొక్క మడత.

○ నుండి కొంతవరకు గీయబడిన గట్టి గీతకు 1 1/2" సమాన దూరములో గీయబడిన మఱియొక గట్టిగీత, షర్టుయొక్క ఓపినింగుపై ఫాల్సు హెమ్మును తెలియజేయును.

4-○ = చాతీ చుట్టుకొలతలో నాలుగవ వంతు. 5-○ = వీపు పొడవు (బొడ్డునకు సమానముగ). 4-11= చాతీ చుట్టుకొలతలో 4 వంతుకు 2" అధికము. 11 నుండి R వరకు చదరపు గీత. 11 నుండి R వరకు గల చుక్కల గీతకు 6, అవసరానుకూలముగ బొమ్మలో చూపినట్లు నడుము గీతపై 1/2" నుండి 1 1/2" వరకు లోనికి నొక్కి కత్తిరించవలయును.

4-11= F - R. ○-1= మెడ కొలతలో 6 వంతు + 1/4" ○-9= మెడ కొలతలో 6 వంతుకు 1/4" తక్కువ. 1 నుండి 9 వరకు బొమ్మలో చూపినట్లు యెదర మెడాకారము.

5-9= చాతీ కొలతలో 3 వంతుకు 1/2" అధికము. ○-2= షోల్డరు కొలతలో సగము 8". చుక్కలగీతకు 2 గుర్తు 3/4" క్రింద. 1 నుండి 2 తో కలుపుము. 2 నుండి 11 వరకు యెదర భుజద్వారము. 11 నుండి 6 ద్వారా F వరకు బొమ్మలో చూపినట్లుగా షర్టు ధరించు వాని అంగీకారము ననుసరించి నడుమువద్ద నొక్కి షర్టుయొక్క సైడ్ ఓపినింగులను షేప్ చేసి కత్తిరింపుము.

## వెనుక భాగము

ఎదరభాగమువలెనే షోల్డర్ పీస్‌యొక్క వెడల్పును మినహాయించి, వెనుక ప్లీట్లు వచ్చునట్లు చూచి వెనుక భుజద్వారమును 1/2" హెచ్చించి బొమ్మను గమనించి కత్తిరించుము.

షోల్డరు పీస్‌లకు 4" వెడల్పు, 10" పొడవు గలిగిన రెండు ముక్కలను నాలుగు పొరలుగా నుండునట్లు చూచి, మొదట గుంటను వెడల్పులో 2 3/4" లోతుగా; వెడల్పునందు 3వ వంతునకు కత్తిరించి, అడుగు భాగమును షోల్డర్ ఎక్రాస్ కట్టుగీతను బొమ్మలో చూపినట్లు కత్తిరించుము.

పైన చెప్పిన బాడీకి ఒకప్పుడు సగము చేతులు వేయవలెననిన, ఫ్రంట్ బాడీస్‌లోనున్న బొమ్మ. పూర్తిచేయవలెననిన బ్యాక్ బాడీస్‌నందుగల పూర్తి చేతి బొమ్మను అవలంబింపుము.

## అరచేయి: కొలతలు

O-B = చేతి పొడవు 10". O కేంద్రమునకు K నుండి చదరముగా నున్న చుక్కల గీత; O,K = ఛాతీలో 4 వంతునకు 1/2" తక్కువ. B - C = ఛాతీలో 4 వంతునకు 1" అధికము. B, C లకు సమానదూరములో గీయబడిన కట్టుగీత చేతి ముందుగల హెమ్ము యొక్క వెడల్పు 2 1/2".

## పూర్తి చేయి

క్రీజ్ ఎడ్జ్ O-O = పూర్తిచేతి పొడవు 23" లకు వేయబోయెడి కఫ్‌యొక్క వెడల్పుగాక అనగా (23" — 2 1/2". Cut Breadth) C-4= కఫ్ లూజ్ 8".

కెరటముల గీతకు అడ్డముగా గీయబడిన దగ్గర గీతలు, ప్లీట్లును గాని, గ్యాదర్స్‌నుగాని సూచించును. కెరటముల గీతనుండిన మూడు చుక్కలపైగల 3 గుర్తు కఫ్ ఓపెనింగ్ 3" అని చెప్పును.

## Boy's Bush Shirt బాలుర బుష్ షర్టు

స్కేలు 1" = 4"




Dia. No. 41.

కొలతలు:

24'' చాతీ చుట్టుకొలత. 7'' చేతి పొడవు.

13 1/2'' ఫ్రాక్ పొడవు. 10 1/2'' మెడ కొలత.

ఇవి 6 సం॥ వయస్సుగల బాలునికి సరిపడు ట్టివి.

## Scientific Drafting శాస్త్రీయమైన కత్తిరింపు విధానము:

### యెదర భాగము Front

O-P = ఫ్రాక్ పొడవు 14''. F-O = చాతీలో నాల్గవవంతు 6'' + 1/4'' = 6 1/4''. E-B = 1''. 7-F = చాతీలో 4వంతు + 3/4'' (6 3/4''). F-8 = చాతీలో 4 వంతుకు 2 1/2'' అధికము. 8-N = 3/4''; N నుండి క్రింది (Bottom) వరకు చుక్కలతో కూడియున్న చదరపు గీత. N నుండి 13 వరకు యెదర భాగపు ప్రక్క కట్టు గీత. F నుండి ○-3 చదరపు గీతవరకు వాలుగీత. 2 నుండి వాలు గీత మెడ కొలతలో 6 వంతు. 2 నుండి 15 ద్వారా 16 వరకు మెడ గుంట. 2-3 = ఎక్రాస్ షోల్డరు. 6- F = చాతీలో 4 వంతుకు 1'' తక్కువ. 3 నుండి క్రింది 6 వరకు చదరపు గీత. 3, 4 = 2 1/2''; 2-4 = షోల్డరు గీత. 2-4- షోల్డరుపై ఫ్రంటు బ్యాకులు కలియునది. 5-6 = 1''. 4 నుండి 5 ద్వారా 7 వరకు యెదర భుజద్వారమును బొమ్మలో చూపినట్లుగా అందమైన వలయముతో గీయుము.

B-C = 1/2''. C నుండి F వరకు గీయుము. C సి = 17 తో కలుపుము. 15-16 = 1''. 17-E = 1''. C.D = 1''. 16 నుండి 17 ద్వారా D వరకు బొమ్మలో చూపినట్టిగీతవలె (Front Line) ఫ్రంట్ బాటం లైనును 14 నుండి 13 వరకు షేప్ చేయుము. ప్రక్క కట్టునందు బాటంలైనునుండి పైకి 2'' చాకులను వదలుము.

### Back వెనుక భాగము

4 నుండి చాతీగీత 8, F = చాతీ చుట్టుకొలతలో 4 వంతుకు షోల్డరు పీస్ వెడల్పు 1 1/2'' తక్కువ. N నుండి బ్యాక్ లైనువరకు

చాతీలో 4 వంతును 1/2" అధికము. 10-9 = చాతీలో 4 వంతుకు 1/2" తక్కువ. 9 నుండి 8 వరకు చదరపు గీత. 9-K = 3/4" బ్యాక్ ప్లీటుకొరకు. K నుండి N వరకు వెనుక సైడ్‌లైను. N నుండి 14 వరకు ప్రక్క బొద్దు గీత.

## Yoke యోక్ లేక షోల్డర్ పీస్

○-G = ○-F లో 4 వంతునకు 1/2" అధికము.
○-4 = చాతీలో 4 వంతుకు 1/4" తక్కువ.
6-5 = ... ... ... 1/2" తక్కువ.
○-3 = మెడ కొలతలో 6 వంతునకు 1/2" అధికము.
3-2 = ... ... ... ... 1/2" తక్కువ.

బొమ్మలో చూపిన ఆకారములతో షోల్డరు పీసును పూర్తి చేయుము.

## Sleeve

చేతులను కత్తిరించుటలో జెన్నీన్ షర్టులోని సగము చేతులను కత్తిరించు పద్ధతి నవలంభింపుము. ఎక్రాస్ షోల్డరుపై స్ట్రిప్స్ అండ్ బటన్స్.

---

## Pyzamas పైజమాలు

స్కేల్ 1" = 7"

ప్రస్తుత వస్త్రధారణయందు ఇది మిక్కిలి సౌఖ్యప్రదమైన దుస్తు. ఒకప్పుడిది పైజమా జాకెట్టుతో కూడినపుడు పడకటింటి డ్రెస్‌గా పరిగణింపబడినను; నేడు - రేపు పంట్లామునకు బదులుగా వాడబడుచున్నది. దీనిని శాస్త్రోక్తముగ కత్తిరించుట కలవాటుపడినవారికి (New Look Trouser) ను కత్తిరించుట అంత కష్టమైన పని కాదు.

## దీనికి వలయు కొలతలు:

(Full Length) పూర్తి పొడవు 41''. సామాన్యముగ అందరికిని పనికివచ్చు పొడవు. (Waist) నడుము చుట్టుకొలత 30''. (Seat) పిరుదల చుట్టుకొలత 36''. (Bottom) కాలిముందు సామాన్యముగ నుంచునట్టి లూజ్ 24''.




Dia. No. 42.

పై భాగము

1-○= పూర్తి పొడవు. 41''. 2-○= పిరుదల కొలతలో 3 వంతు. ○ నుండి యిరుప్రక్కల చదరపు గీతలు. 1-2=1 1/2''; 4-3= సీటులో 3 వంతు. 5-3= పిరుదలలో 3 వంతు. 4 నుండి పైన 6 వరకు చదరపు గీత. 7-4= 6-4 లో సగమునకు 1 అం॥ అధికము. 7 నుండి 5 వరకు బొమ్మలో చూపినట్లు వంపుగా గీయుము. 8-1= 5-2 కు 1 అం॥ తక్కువ. కాలి ముందు కొలత తీసికొనినయెడల 8 నుండి 1 వరకు ప్రయోగించవచ్చును. 5-8= లోపలి కాలికట్టుగీత (Inside Leg Seam) కాలి ముందు పట్టీకొరకు 2 1/2 అం॥ వదలుము.

అడుగు భాగము

9-5= 3/4 అం॥; 10-6= 1 1/4 అం॥. 9 నుండి 10 వరకు కలుపుచూ పైన 11 వరకు పొడిగించుము. 11-10= 1 1/2 అం॥. 12-5= 2 1/2 అం॥. 12 నుండి — 11 వరకు సీటు కట్టు గీతను నిరూపించినట్లు గీయుము. 13-8= 1 1/4 అం॥.; 12-3= కాలి కట్టు గీత. ప్రక్క జేబులు కోరబడనియెడల ○-1 లైనుపై క్రీజ్ ఎడ్జిపై కత్తిరించుము.

# COAT CUTTING

స్కేల్ 1" = 5"

**Reduced Scale** తగ్గింపబడిన పరిమాణము 1" = 5"

ఈ క్రింద నీయబడిన కొలతలను కోటును కత్తిరించుటలో గత (గడచిన) (Child's Tunic) విధానము ననుసరించుట మిక్కిలి ఉత్తమము.

కొలతలు:

కోటు పూర్తి పొడవు 30 అం॥ (వెన్నెముకకు పై పూసనుండి క్రింది పిరుదలమీదుగా అవసరమైనంత పొడవు) ఛాతీ చుట్టుకొలత

## Cutting

O కేంద్రము. O, 2 & O, O లు చదరపు గీతలు కేంద్రమునుండి. O, O= కోటు పూర్తి పొడవు 30" + 1/2". M. O= చాతీ కొలతలో 4 వంతు. (Chest Line) N, O= వీపు పొడవు 16" + 1/2". L. O= M. O లో సగము. K, O= L O లో సగము. పై గుర్తులనుండి చదరపు గీతలు. N, 6= 3/4 అం॥; O, F= 3/4 అం॥ బొమ్మలో చూపిన K, L, 7, 6 గుర్తులద్వారా బ్యాక్ కుట్టు గీత (Back Seam) O, E= M, 2; L, 9= చాతీ కొలతలో 6 వంతునకు 1 1/2 అం॥ అధికము. 9 నుండి పై 10 వరకు చదరపు గీత. 10, E = 1/2 అం॥; A, 2= 3/4 అం॥ O, A= వెనుక మెడగుంట. 15, 6= 1/2 అం॥; B, 6= వెనుక భాగపు భుజ ద్వారము. B నుండి 10, 9, 15 గుర్తులద్వారా 6 వరకు వెనుక భుజ ద్వారము. 6, 17= నడుముకొలతలో 6 వంతు. F, 9= 6,17+1" 6 నుండి 11, 17 గుర్తులద్వారా బొమ్మలో చూపిన ఆకారముతో బ్యాక్, సైడ్ సీమును 9 వరకు గీయుము.

### ముందర భాగములు

2, 7= చాతీ కొలతలో సగమునకు 2" అధికము. 2 నుండి E వరకు చదరపు గీత. 20, 2 = చాతీలో 4 వంతుకు 1" తక్కువ. 24, 20= చాతీలో 12 వంతు. 24 నుండి కాలరు పాయింటు C వరకు చదరపు గీత. C , 24= చాతీలో నాల్గవ వంతుకు 3/4 అం॥ తక్కువ యుంచినయెడల కోటు తొడిగినపుడు గుండీలు తగిలించనప్పటికి ఫ్రంట్లు విడిపోక దగ్గరగా పడియుండును. C, ని B తో కలుపుము. (Across Shoulder Line) C , 26= A, B — 1/4 అం॥ C – B ఎక్రాస్ షోల్డరు లైనుకు 1/4 అం॥ క్రింద 26 గుర్తు. 27, 20= 1 1/2 అం॥ ఫ్రంట్ భుజద్వారమును 26 నుండి 27 ద్వారా 6 వరకు బొమ్మలో

చూపినట్లు చక్కని వలయాకారము. 22, 21 = 8, 2 + 1/4". 31, E = 2, 8 + 2". ఫ్రంట్ సైడ్ సీమును 6 నుండి 8, 22 గుర్తులద్వారా 31 వరకు గీయుము. C, 3 = బాడీలో 12 వంటు. 3 నుండి పడిక్రైన పున్ను చదరపు గీత. 2, 21 గుర్తుల సరిగా మధ్య భాగము D నుండి పై C వరకు (Turning Lapels) టర్నింగ్ లైనను చూపించును. పై జేబును బొమ్మలో చూపినట్లు చాతీలైను నకు 3/4" క్రిందుగా గుర్తించవలెను. క్రింది జేబులు (Waist Line) నడుము గీతకు 4" క్రిందుగా 5 3/4" వెడల్పు జేబును మార్కు చేయవలయును.

# FINISH

## Trade Terms దీనికి సంబంధించిన నూతన పదములు

### బ్యాక్ పిచ్ & ఫ్రంట్ పిచ్

అనగా ప్రతికోటుయొక్క వెనుక ముందుభాగపు కొల్లను బాడీయొక్క వెనుక, ముందు భాగము గుర్తులు బాడీలో భుజద్వారమునందలి 9, 27 గుర్తులకు సమానంపుము. అవియే పై చెప్పిన పదములు. అదేవిధముగ ప్రతి బొమ్మలో నీయబడిన B, A గుర్తులు. చేతిని గీయునపుడు బాడీ భుజద్వారమునందలి గుర్తులను, ప్రతి భుజము నందలి గుర్తులతో పోల్చి చూడుము.

## Sleeve చేయి

### స్కేల్ 1" = 5"

○, B & ○, A లు చదరపు గీతలు. ○, A = బాడీ లోని 9-11 — 1/4 నకు సమానము. A నుండి B వరకు నొకచుక్క & డాష్ గీత; మరియొకటి విడగొట్టబడి గీత = B, 9 + 26, 27; ○, B లకు సరిగా మధ్య గుర్తు 2; ○, 2 నకు సరిగా మధ్యనుండి

పై భాగముయొక్క వలయము 3 నుండి A వరకు. 2, 3= 1''; B నుండి 3 ద్వారా A వరకు బొమ్మలో చూపినట్లు పై భాగపు వలయము; B నుండి 1/2 వరకు గీయబడిన డాష్ లైను పూర్తిచేతిపొడవు 31 1/2'' — 7 3/4 ఎక్రాస్ బ్యాక్ + 1 1/4'' చేతి ముందు క్రాస్




Dia. No. 44.

షేప్= 1 1/2''. చేతి ముందు బూజ్, చాతీలో 6 వంతు. A, 1/2 లకు 1'' గుర్తు సరిగా మధ్యభాగము. అట్టి మధ్యభాగము వద్ద 3/4'' వలయము. A నుండి 1/2 వరకు బొమ్మలోని వలయము.

## అడుగు భాగము

4 నుండి 5 ద్వారా A వరకు గల వలయాకారము బాడీలో 9 నుండి 27 వరకు గల కొలతకు సమానము. A నుండి 5 చదరపు గీత. A - 5= 27, 11 లో సగమునకు 1/2'' అధికము. బొమ్మలో చూపినట్లు 4 నుండి 5 ద్వారా A వరకును, 4 నుండి N వరకును బొమ్మలో చూపినట్లు పూర్తిచేయుము.

## లాల్చీ (Kalli - Kurta)

స్కేల్ 1"=9"

ఇది ఉత్తరహిందూస్థానమునందు ఆబాలగోపాలము ధరించునట్టి సామాన్య దుస్తు. శాస్త్రీయమైన వస్త్రధారణలో సుఖవంతమయినది.




Dia. No. 41.

వలయు సామాన్య కొలతలు:

షోల్డరు జాయింటువద్ద కట్టునుండి క్రింది మోకాలిపై 2" వరకు గల పూర్తిపొడవు 36", షోల్డరు కొలత 16", చేతిపొడవు 23 1/2"

మెడ కొలత 14". దీని భుజద్వారము మస్తువలె వలయముగాక చదరముగా నుండి కుట్టు 1 1/2" పట్టీతో కూడియుండును.

కత్తిరింపు పద్ధతి

○-36=పూర్తిపొడవు 36"+అడుగుహెమ్ముకొరకు 1/2" ○-8= షోల్డరు కొలతలో సగము 8". 5-36= 8, 0; 8 నుండి 5 తో కలుపుము. ○- 2 1/2= మెడ కొలతలో 6 వంతు. ○-2= మెడ కొలతలో 6 వంతుకు 1/4" అధికము. యెదర మెడగుంటను 2 1/2 నుండి 2 వరకు కలుపుము. యెదర ఓపెనింగ్ కొరకు ○ నుండి క్రిందికి 13 1/2".

వెనుక భాగము

వెనుక మెడగుంట ○-2 లకు మధ్యనున్న వలయము. మిగిలిన వన్నియు పై భాగంబువలెనే!

బ్యాక్ ఫ్రంటులకొరకు ○-36 లైనుపై క్రీజ్‌ను వదలుము.

## Sleeve చేయి

8-3 = చాతీలో 4 వంతునకు 1" తక్కువ. 8-B = చేతి పొడవు 23 1/2". అంచులు చేతిముందు వచ్చునట్లు చూచి కత్తిరించవలెను. చేతిముందు లూజ్ తగ్గవలెననిన B - A వలెను, చేతిముందు హెచ్చవలెననిన B 6 వలెను కత్తిరింపుము.

## Kalli Piece కళ్ళి ముక్క

S, N= M. P.; చతురాకారము. C - D = 8-3 లో 4 వంతు. 5-4= 8. 3. D - 4 లను కలుపుము. 4 నుండి 5 వరకు వలయాకారము. కళ్ళి ముక్కలను మడతపై కత్తిరించవలెను. D, E = D - 4 లో 4 వంతునకు 1 1/2 అం॥ అధికము. E, F= చాతీలో 6 వంతు ప్రక్కజేబు ఓపెనింగు. N - 4= D - 4 లో 4 వంతునకు 1 1/2 అం॥ అధికము. N నుండి క్రింది 4 వరకు చాకులు (Side Openings) బగలు ముక్క = 2 1/2 అం॥ చతురాకారము.

## Initials & Monograms పొడి అక్షరములు - సంతకములు

ఇనీషియల్స్ — మోనోగ్రామ్స్, ఎంబ్రాయిడరీలో బట్టపై కుట్టుటలో విక్టోరియన్ యుగము చాల ప్రసిద్ధిచెందినది. ఆ దినములలో అందమైన ఎంబ్రాయిడరీ కుట్టుగల దుస్తులు యింటియం దుండుటయే గృహలక్ష్మియొక్క ఘనతను తెలియబరచెడివి. తువ్వాళ్ళపైని, తలగడా గలేబులపైన, చేతిరుమాళ్ళపైని తమ సంతకపు టక్షరములను ప్రతివారును స్వయముగా ఆ యుగమునందు కుట్టుకొనెడివారు. ఈ నాటి స్త్రీలకు అట్టి దుస్తుల నుపయోగించు యోగ్యత లేకపోయినప్పటికిని, తమకున్న సామాన్య దుస్తులకైననైనను యిట్టి అక్షరములను కుట్టుకొని ధరించిన బాగుండెడిది.

ఎంబ్రాయిడరీ పనిలో అట్టి అక్షరములను కుట్టుటలో చాల పద్ధతులు గలవు. సాటిన్ స్టిచ్‌తో పొడి అక్షరములను కుట్టుట లగాయితే పూర్తి సంతకములనుగాని, పూర్తి పేర్లనుగాని పోగుతీత విధానమునందు ఎంబ్రాయిడరీ చేయదలచినచో యీ రకపు కుట్లు ఉపయోగపడును. కనుక కుట్టుపని నేర్చిన ప్రతివారును తమకు అందుబాటులో నున్న రకమును ఎంచుకొనవలయును. తరువాత యే రకపు అక్షరములను కుట్టుటయో నిర్ణయించుకొనవలయును. సాధారణముగా రోమన్ అక్షరములు, పూర్వపు యింగ్లీషు అక్షరములు, వ్రాత అక్షరములు- నవీన Angular అక్షరములు యీ రకపు ఎంబ్రాయిడరీ పనికి ఉపయోగించెదరు. మన ముపయోగించ దలచిన అక్షరములు కంటికి యింపుగా నుండునట్లు చూడవలయును.

పోగుతీత విధానములో కుట్టునపుడు అక్షరములను వంకీలుగా త్రిప్పు Style అందముగా కన్పట్టును. కాని క్రాస్ స్టిచ్‌లో యాంగ్యులర్ డిజైనే కాని పై చెప్పిన [illegible] రాదు. ఒక మోనోగ్రాములో రెండు వేరు వేరు Styles ఉపయోగించరాదు.

## Methods పద్ధతులు

దుస్తులపై అక్షరములను కుట్టునప్పుడు అవలంభించవలసిన విధులు:

కుట్టు ప్రారంభించుటకు పూర్వము కావలసిన అక్షరములను మొదట కాగితముపై కత్తిరించిగాని, బట్ట తెల్లనిదైనయెడల పెన్సిలుతో వ్రాసికొనిగాని ప్రారంభించవలయును.

## Suitable Stitches. సరిపడు కుట్లు:

సాటీన్ కుట్టు మొదట కాగితములో కావలసిన అక్షరములను కత్తిరించి బట్టపైనుంచి సన్నని దారముతో టాక్‌కుట్టువేసి బిగించి తరువాత ప్రారంభించవలయును.

(2) గొలుసుకుట్టు పై విధముగనే అక్షరములను బట్టపై గుర్తించి టాకీలు పెట్టుకొని గొలుసుకుట్టు ప్రారంభించవలయును. యిందులకు కావలసిన అక్షరములను ఒకే సైజులోగాని, వివిధ సైజులలోగాని కూర్చి గొలుసుకుట్టు కుట్టినతరువాత సాటీన్ కుట్టుతో పూర్తి చేయవలయును. అక్షరముల అంచుభాగములను స్ప్లిట్ కుట్టుకుట్టి మధ్య ఖాళీభాగమును గొలుసుకుట్టుతో పూర్తి జేసి అటుపైన సాటీన్ కుట్టు వేయవలయును.

## Stem Stitch.

అక్షరముల అంచులను కొమ్మకుట్టు వేయవలయును. యిది బహు అందముగా కన్పట్టును. అక్షరములను కుట్టిన తరువాత Back Ground అనగా పృష్ఠభాగమును ప్రక్కలనుండి అక్షరములతో కలిపి కుట్టిన అందము నిచ్చును.

---

శ్రీ పరమేశ్వరీ ముద్రణాలయము, అనకాపల్లి.